# మనుష్యులు - మనస్సులు



మునిపల్లె సరోజినీదేవి

ప్రచురణ
నవీన గ్రంథమాల
ఏలూరురోడ్ - విజయవాడ-2

ర చ యి త్రి

# యితర రచనలు

(1) జీవన మాధుర్యం

(2) అ భా గి ని

# మనుష్యులు - మనస్సులు

కౌసల్య పుట్టింది సామాన్య కుటుంబంలోనే అయినా అదృష్టవశాత్తు ఇంతో, అంతో ఐశ్వర్యం కలవారింటి కోడలైంది.

కౌసల్యకేమిలోటు ?— అనుకున్నారంతా. అప్రసు అప్పట్లో ఎలాంటి లోటూ లేదనే చెప్పాలి. అందగాడైన భర్త. సంపాదనా పరుడు; సద్గుణ సంపన్నుడు; భార్యానురక్తుడు భగవద్భక్తుడు. స్త్రీకి యింతకన్న కోరతగిన అదృష్ట మేముంది? ఈ మాటే అంతా అన్నారు. ఆ మాటలు విని మురిసిపోయింది కౌసల్య.

కౌసల్య కిద్దరు బావగార్లూ, ఒక మరిదీ ఉన్నారు. అందరూ పుష్కలంగా సాంపాదిస్తున్నా వేరు వేరు కాపరాలు పెట్టక ఉమ్మడిగానే ఉంటున్నారు.

కొడుకుల అన్యోన్యాలు చూసి మురిసిపోయింది జానికమ్మ. కౌసల్య భర్త కాంతారావు పట్టుదల మీద ముద్దుల మరిది మోహనుడు చదువు సాగించేడు. పెద్ద వాళ్లు

ముగ్గురికే చదువు సంధ్యలు అబ్బలేదు. ఎవరికి తోచిన వ్యాపారం వారు చేసుకుంటూ సుఖజీవనం చేస్తున్నారు.

పెద్దవాడు మాధవరావు బట్టల వ్యాపారం చేస్తుంటే. రెండోవాడు పద్మనాభరావు నూనెకొట్టు పెట్టాడు.

మూడోవాడు కాంతారావు కిరాణా దుకాణం తెరిచేడు.

నాల్గోవాడే మోహనుడు.

చిన్న అన్నగారి ప్రోత్సాహముతో బి. ఏ. దాకా చదివేడు. అయితే ఉద్యోగమనే పేరుతో దాస్యశృంఖలాలు తగిలించుకోక స్వేచ్ఛావిహాగంలా విహరించాలనే ఉద్దేశ్యంతో స్వయముగా మందులషాపు తెరిచాడు. అందరికంటే పెద్దాయన భార్య సుమిత్ర గడసరిది. రెండో ఆమె తటస్థురాలు. మూడోదే కౌసల్య. నాల్గో ఆమె మాటకారి, ఎవరు ఎలా చెప్తే అలా నమ్ముతుంటుంది. పేరు మాధవి.

అత్తగారి పెత్తనం సాగినంతకాలం ఆ యిల్లు ఆనందానికి ఆలయం, శాంతికి ఆటపట్టు, సుఖసంతోషాలకు నిలయం.

కానీ కాలమెప్పుడూ ఒకే తీరున గడవదు. ఉన్నట్లుండి హఠాత్తుగా కాంతారావు వ్యాధిగ్రస్థుడైనాడు. "దార" (మూర్ఛలు) లొచ్చేవి.

"కౌసల్యా" అంటూ పిలిచేడు కాంతారావు.

"ఊఁ"

"ఆకలవుతోంది, ఏమైనా పెట్టవూ?"

"ఉండండి. డాక్టరుగార్ని రానివ్వండి మరిది వెళ్ళేడు పిల్చుకు రావటానికి"

"అబ్బా! డాక్ట రెంత సేపటికి వస్తాడో కదా! అంత వరకూ నేనిలానే మాడి చావాలంటావా?"

"మరేమి చెయ్యమంటారు చెప్పండి? డాక్టర్ని అడక్కుండా ఏది పడితే అది తింటారా?"

"అయితే అంతవరకూ నేనిలా చావ వలసిందే"

"అంత విసుగైతే ఎలా చెప్పండి! వ్యాధి వచ్చినప్పుడు డాక్టరు సలహా తీసుకోవద్దూ?"

"అమ్మా, ఓ...అమ్మా"

"ఏం నాయనా?" అంటూ జానికమ్మ పరుగెత్తుకొచ్చింది.

"నాకు ఆకలవుతున్నదమ్మా"

"అలాగా; ఉండు బాబూ, వంట అవుతున్నది తిందువుగాని"

"ఇష్......ఎంత సేపుండేది చెప్పు? అయితే అత్తా కోడళ్ళిలా కలిసి చంపేస్తారా నన్ను?"

"అవేం మాటలు బాబూ. తప్పు. అలాంటి మాటలు నోటివెంట రానివ్వకు"

"మరెలాంటి మాటలొస్తాయో చెప్పు. ఆకలవుతున్నదో అని మొత్తుకుంటుంటే వినిపించుకోరు. ప్రాణం పోతున్నా డాక్టరు అనుమతి లేందే పచ్చి మంచినీళ్ళు కూడా గొంతులో పొయ్యరా ఏమిటి ఖర్మ?"

"అదేనిట్రా-నీచ్చివాడా. నీ బాగు కోరేచెప్పేది. సరే ఉండు. నాలుగు మెతుకులు తెస్తాను." అంటూ జానకమ్మ వంటింటివైపు వెళ్ళిపోయింది.

"అత్తయ్యా, డాక్టరు గార్ని అడగకుండానే పెడతారా? కాస్త ఆగకూడదూ?" కౌసల్య ఉండబట్టలేక అడ్డుకుంది అత్తగార్ని.

"బాగున్నదేవ్, అవతల వాడు ఆకల్తో అని అలమటిస్తున్నాడు. ఇవతల నీవు పెట్టొద్దంటావు. మధ్య నా చావు కొచ్చింది. బిడ్డల ఘోష నీకేమి తెలుస్తుంది!" అంటూ రూషణంగా పలికి లోపలికి వెళ్ళిపోయింది.

కౌసల్య ముఖం కందిపోయింది కోపంతో.

"అవును. నాకేం తెలుస్తుంది? రేపు ప్రాణం మీదికొచ్చి నప్పుడు తెలుస్తుందిగాని..."

"ఆ, ఏవిటే నోటికొచ్చినట్లల్లా ప్రేలుతున్నావు! వాడికొస్తే నీకు సుఖంగా ఉంటుందనుకొంటున్నావా?"

"అని ఎవరన్నారు? మీకలా ఉంటుందేమో నాకు తెలీదు—" కౌసల్య మొఖం చిట్లించింది.

"అవునే, హద్దూ పద్దూ లేకపోతే సరి. ఎంత మాటైనా అంటావు. అత్తగారి అదుపాజ్ఞల్లో అసలే ఉండవు. భర్త

మీద ప్రేమైనా ఉండాలి; గౌరవమైనా ఉండాలి......ఎవరి మాటా లక్ష్యం లేదు నీకు-ఛీ-" అంటూ జానికమ్మ యింట్లోకి వెళ్ళి అన్నమూ, కూరలూ కంచంలో పెట్టుకొని కొడుకు మంచం దగ్గరకి తీసుకెళ్ళింది.

స్టూలు దగ్గరకి లాగి కంచం స్టూలుమీద పెట్టింది.

కొడుకుని లేవతీసి గోడకి దిండు ఆనించి కూర్చోబెట్టింది.

"బాబూ తింటావా? కలిపి పెట్టనా?" అంటూ అన్నం కలిపి ముద్ద చేసి చేతిలో పెట్టింది. కాంతా చెయ్యి ఎత్తబోయాడు. చెయ్యి నోటిదాకా పోనేలేదు. చెయ్యి వణికి చేతిలోని ముద్ద కంచం మీద పడిపోయింది.

జానికమ్మ స్వయంగా తనే తినిపించ సాగింది. ఒకొక్క ముద్దకలిపి నోట్లో పెడుతుంటే కాంతారావు మింగుతున్నాడు.

అంతవరకూ అక్కడే ఉన్న కౌసల్య అత్తగారి పంతానికి ముఖం మాడ్చుకొని గిరుక్కున తిరిగి లోపలికి పోయింది.

మోహన్ డాక్టర్ని వెంటబెట్టుకొచ్చాడు. జానికమ్మ కొడుకు మూతి, చెయ్యి కంచంలో కడిగి తుడిచి కంచం తీసుకొని లోపలికిపోయింది.

మోహన్ లోపలికి వెళ్ళి కుర్చీ తెచ్చి వేశాడు.

డాక్టరు కాంతారావుని పరీక్షించి మందులూ ఇంజక్షన్‌లు వ్రాసి యిచ్చేడు.

"వదినా" అంటూ పిలిచేడు మోహన్.

"దేనికిబాబూ" అంటూ వచ్చిన కౌసల్య డాక్టర్ని చూచి గుమ్మం దగ్గరే ఆగిపోయి తలుపుచాటున చేరింది.

"డాక్టరుగారు వచ్చారు."

"పరిస్థితి ఎలా ఉన్నదంటున్నారు? ఏమేమి పెట్టవచ్చంటున్నారు?"

"ఉప్పు తగలకూడదమ్మా" అన్నాడు డాక్టర్ తురంగేశ్వర రావు.

"అలాగా? ఇంకేమైనా పథ్యం ఉన్నదా? అన్నీ తినవచ్చునా?"

"మరో ముఖ్యవిషయం ఉన్నది తల్లీ—" అంటూ ఆగిపోయేడు డాక్టరు.

"ఏమిటో శలవియ్యండి"

"మీారు మరోలా భావించనంటే చెప్తాను. ఈ పరిస్థితిలో మీారు బ్రహ్మచర్యం వహించాలి.

"... ... ..."

"ఏమో చెప్పాడని నిర్లక్ష్యం చెయ్యవద్దు. ఈ మాట బాగా గుర్తుంచుకోండి. అలాంటిదేమైనా జరిగితే... నేను

ఆపైన చెప్పటం బాగుండదు. మీరే ఊహించుకోగలరు. ఇంక వెళ్ళి వస్తాను" అంటూ డాక్టరు వెళ్ళిపోయాడు.

డాక్టర్ని గుమ్మందాకా పంపి వచ్చేడు మోహన్.

కౌసల్య బ్రమాన్పడిపోయింది.

"వదినా" అన్న మరిది పిలుపుతో ఈలోకంలోపడింది

పెళ్ళయి పట్టుమని పదినెలలైనా గడవలేదే! ఏమిటీ దురదృష్టం.

---

## 2

"అమ్మా, ఓ అమ్మా"

"దేనికండీ" అంటూ కౌసల్య దగ్గరకొచ్చింది.

"ఆకలవుతోంది"

"అయితే రెండు క్షణాలు ఆగండి తెస్తా" నంటూ వెళ్ళింది కౌసల్య.

కంచంలో అన్నమూ, కూరలూ తెచ్చి బల్లమీద ఉంచింది. అన్నం కలిపి ముద్దచేసి కాంతారావు నోటి కందించింది.

"థూ-థూ" అంటూ ఉమ్మేశాడు కాంతారావు.

అన్నం చింది కౌసల్య ముఖం నిండా పడింది.

"ఏమిటండీ ఇలా..." అన్నది కౌసల్య ముఖం పమిట కొంగుతో తుడుచుకుంటూ.

"ఏమిటా నీ శ్రాద్ధం" ఉప్పులేని చప్పిడి కూడు ఎవరు తింటారనుకున్నావు. అంత వంట చేతకాకపోతే మరెవరినైనా చెయ్యమనకపోయ్యావూ ?"

"ఉప్పు తినకూడదని డాక్టరు చెప్పలేదూ."

"డాక్టరుకేం ... ఎన్నైనా చెప్తాడు... ఆయన కాదుగా తినేది? తినేవాడికి తెలుస్తుంది. చప్పగా, రుచీ, పచీ

లేని భోజనం ఎవరికి కావాలి? నేనేం గొడ్డునా? ఇంత గడ్డి తిని పడి ఉంటానికి"

"అయితే రోగమెలా తగ్గుతుంది?"

"తగ్గకపోతేపోనీ.....ఇలా చస్తూ బ్రతికేకంటే-ఒక్కసారే హరీ అంటాను. అంతేకదా! ఈ నరకము నేననుభవించలేను"

"పెద్దవారు మీరే ఇలా మారాం చేస్తే ఎలా? పసిపిల్లలా తెలియకపోవటానికి? తెలిసికూడా అలా మూర్ఖపు పట్టుపడితే ఎలా?"

"పట్టేమిటి పట్టు. ఓ ప్రక్కన ఆకలికి చస్తుంటే-"

"ఆకలయితే ఎవరైనా తినవద్దన్నారా?"

"ఎందుకంటారు? పొమ్మనలేక పొగ పెట్టాఁటలే... అట్లా చేస్తే సరి"

"నేనేం చెయ్యను. డాక్టరు చెప్పినట్లు వింటే త్వరగా నయమవుతుంది. తగ్గితే అన్నీ తినవచ్చు కదా"

"అవునవును. పండ్రెండు కరువులొస్తున్నాయట. ఈ పుట్టెడు గింజలు అట్టె పెట్టేస్తే నిశ్చింతగా గడిచిపోతుందని తిండి మానేసి దాచిపెట్టారట. ఇప్పుడు బ్రతికితేకదా-రేపటి మాట ఆలోచించేది"

"మీకు ఎవరు చెప్పగలరు? తెలియని వాళ్ళకైతే ఎవరైనా చెప్పగలరు. తెలిసి తెలిసి పట్టుపట్టే వాళ్ళ నెవ రేమి చెయ్యగలరు? మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి" అంటూ కౌసల్య కంచం పట్టుకొని లోపలికి వెళ్ళిపోయింది.

"అమ్మా" అంటూ కేకవేశాడు కాంతారావు.

"దేనికి బాబూ" అంటూ వచ్చింది జానకమ్మ.

"ఆకలవుతున్నదమ్మా"

"మీ ఆవిడ తెచ్చింది కాబోలుగా" అన్నది జానకమ్మ ముఖం చిట్లించి.

"దాని ముఖంలా ఉంది. ఉట్టి చప్పిడి మెతుకులు. ఎవరుతింటారు? ఉప్పులేదు. కారంలేదు. పెడితే సరైన తిండి పెట్టండి. లేకపోతే మాడ్చి చంపండి. అంతేకానీ, ఇలా చప్పిడికూడు నా ముఖాన తగలేసి రోజూ చంపకండి" అంటూ విసుక్కున్నాడు కాంతారావు.

"ఏమి చెయ్యమన్నావురా. ఏదైనా పెడదామంటే నీ పెళ్ళాము గయ్యిమంటూ మీదికొస్తుంది. పెట్టకపోతే ఇలా అఘోరిస్తావు నీవు. మధ్యన నాకు చావొచ్చి పడింది" అంటూ నెత్తి బాదుకొని లోపలికి వెళ్ళింది జానికమ్మ.

కౌసల్య బయటికొచ్చేసరికి జానికమ్మ అన్నం తినిపిస్తున్నది కాంతారావుకి.

"మీ కెన్నిసార్లు చెప్పేది? డాక్టరు వద్దంటే వినరు కదా. రేపేదైనా ముంచుకొస్తే ఏడ్చేది నేనేగా? తినకపోతే ఊరుకోండి. ఆకలవుతే ఆయనే తింటారు-"

"అవునే... చద్దన్నం తిన్నమ్మ మొగుడాకలి ఎరగదని కడుపునిండా తినే దానికి నీకేం తెలుస్తుంది వాడిబాధ! వాడికెంత ఆకలిగా ఉన్నదో-పాపం, పిచ్చి సన్యాసి; నోటికి

రుచించని పదార్థాలు పెట్టి, తిను, తినుమని బలవంతం చేస్తే వాడెలా తింటాడే... ..."

"ఎలాగా? బాగానే తింటారు. మీరే అయ... చేస్తున్నారు. రోగి చెప్పినట్లు వింటే రోగం నయ మవుతుందా?"

"అయితే వాడు కులాసాగా ఉండటం నాకిష్టంలేదంటా వుటే- ఔరా! ఎన్నిమాటలు నేర్చావే- గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్లయింది నా బ్రతుకు"

"ఇలాంటే అలా అంటారు. డాక్టరు మనమీద కోపం కొద్దీ చెప్పటంలేదుగా. మనమంచికోరి చెప్పేవాళ్ళమాట వినకపోతే చెడిపోయేదెవరు? చెరువుమీద అలిగిపోతే నష్ట మెవరికి? మీ కెంతని చెప్పను?" అంటూ కౌసల్య విసురుగా తనగదిలోకి వెళ్ళిపోయింది.

జానికమ్మ అన్నంతినిపించి కొడుకు చేతులూ మూతీ కడిగి వెళ్ళిపోయింది.

కాంతారావు నిట్టూర్చి మంచంమీద వాలేడు.

కౌసల్యకి మనస్సంతా వికలమైంది. భర్త పట్టుపట్టి డాక్టరు వద్దన్నపని చేస్తున్నాడు. అత్తగారు అతనికి వత్తాసు పలుకుతున్నది. తను నిస్సహాయురాలు.

కౌసల్య కా నా డేమీ పనిచెయ్యబుద్ధి కాలేదు. కాలం భారంగా గడిచింది. సాయంత్రం అయింది. వెలుగు మెల్లిమెల్లిగా నిష్క్రమిస్తుంటే చీకట్లు త్వరత్వరగా వ్యాపిస్తు న్నాయి.

కౌసల్య మనస్సు నిండా కారుమబ్బులు క్రమ్మాయి. అలసత్వము కౌసల్య శరీరంలో స్థావరం కల్పించుకుంది. ఏపనీ చెయ్య బుద్ధి కాలేదు. మనస్సు ఉల్లాసంగాలేదు. ఏదో పెద్ద బండని గుండెలమీద పెట్టేసట్లుగా ఉంది ఊపిరికూడా పీల్చలేనంత నీరసంగా ఉంది. మనస్సు బాధతో, భయంతో, మెలికలు తిరుగుతూఉంటే శరీరంచచ్చుపడినట్లే ఉంటుంది. తిన్న తిండి అంతా నీరు కారిపోయినట్లవుతుంది.

కౌసల్య కేమీ తోచలేదు. కాసేపు దిండుగలేబుమీద లతలు కుట్టింది; కాసేపు పచార్లుచేసింది. కొద్దిసేపు కిటికీలో గుండా ఆకాశంవంక తదేకముగా చూస్తూ నిలబడింది. వెలుగు పూర్తిగా భయపడి పారిపోతే-చీకటి వికటాట్టహాసం చేస్తూ ప్రపంచాన్నంతా తనస్వాధీనంచేసుకొని గడగడ లాడిస్తోంది.

కౌసల్య గుండె దడ దడలాడింది. కాళ్ళు వణుకు తున్నాయి. అధరాలు అదురుతున్నాయి, చేతులు స్వాధీనం తప్పినట్లు లోళ్ళ లా వ్రేలాడుతున్నాయి.

తనజీవితం ఏమికాబోతుంది? తన జీవితంలోనుంచి వెలుగు శాశ్వతంగా నిష్క్రమిస్తూందా? చీకట్లు ఆస్థానే తమ ప్రభుత్వాన్ని నెలకొల్పుతాయా? మళ్ళీ వెలుగు రాదూ?

ఎందుకురాదూ? అది ప్రకృతిసిద్ధమేకదా! తెల్లవారగానే సూర్యుడు తన సహస్రనయనాలతో చూపులతూపులు

విసిరి చురుక్కుమనిపించటంలేదూ. సూర్యుని తీక్ష్ణ వీక్షణాల వేడికి చీకటి కరిగి నీరై కానరాకుండా పోవటంలేదూ?

అలాగే తన జీవితంలో వెలుగు ఎందుకు రాకూడదూ?

కాంతారావుకి వ్యాధి నయంకూడదూ?

ప్రపంచంలో సాధ్యంకానిదేది? అయితే అది ఎవరి చేతుల్లో వుంది?

మానవుడు ఎంత విజ్ఞానవంతుడైనా, శాస్త్రవేత్త అయినా విధి అనే బలీయశక్తిని ఎదురోలేడు. విధి వైచిత్ర్యాలేమిటో ఎవరికీ అంతుపట్టదు.

"కౌసల్యా" క్షీణస్వరంతో కాంతారావు పిలుపు కౌసల్య చెవుల్లో దూరింది.

కౌసల్య ఉలిక్కిపడింది! ఆలోచనల సాలెగూడునుంచి తప్పించుకొని అదిరే గుండెల్తో బెదరే చూపుల్తో, దడదడలాడే పాదాలతో, గజగజ వణికే చేతుల్తో మెల్లగా కాంతారావు మంచం సమీపించింది.

"కౌసల్యా అలా నిలబడ్డావేం? ఇలారా, కూర్చో ఊఁ-ఏం? భయంగా ఉందా? పిచ్చిపిల్లా ఇలారా."

కౌసల్య మెల్లగా భర్తప్రక్కనే మంచంమీద కూర్చుంది.

కాంతారావు చేతులు కౌసల్యని పెనవేసుకున్నాయి.

కౌసల్య మెల్లగా విడిపించుకోబోయింది. వారించ దలచింది. మనస్సు వెనకాడుతోంది. గుండె దడదడలాడుతోంది. నోటినుంచి మాట పెదవులు దాటి రావటంలేదు.

ఏదో రహస్యం చెప్తున్నట్లుగా వస్తున్నాయి మాటలు.

"వద్దు, వద్దు నామాట వినండి నా పసుపుకుంకం నిలవాలంటే - నామాట వినరూ?" ప్రార్థిస్తోంది. అర్థిస్తోంది.

"కానీ... కానీ... కానీ..." కాంతారావు నీరసంగా నవ్వి కౌసల్య ప్రార్థనల్ని పెడచెవిన పెట్టాడు.

కౌసల్యని తనలో చేర్చుకున్నాడు. కౌసల్య అసహాయురాలు. అసమర్థురాలు.

కాంతారావు నీరసంతో వెనక్కి వాలిపోయేడు. కౌసల్యగుండె గొంతులోకి వచ్చినట్లయింది.

మాటలు పెగలటంలేదు.

కాంతారావుకి దుప్పటి కప్పింది. విసనకర్రతో విసిరింది అలాగే స్టూలుమీద చతికిలపడింది. కాళ్ళు వత్తుతూ కూర్చుంది.

నిద్రాదేవి కౌసల్యని తన వడిలోకి చేర్చుకుంది.

తెల్లవారింది.

కౌసల్య అత్తగారువచ్చి చూచింది.

"కౌసల్యా"

"ఊ" అంటూ ఉలిక్కిపడి లేచింది.

"అబ్బాయికి ముఖం కడిగించవూ? ఇంత ప్రొద్దెక్కింది. ఏం నిద్దరే, మొద్దు నిదర. ఒకవైపు వాడు రోగనుతో బాధపడుతుంటే యిలాగేనా నిద్రపోవడం?" అంటూ [illegible] కోడల్ని మందలించింది.

కౌసల్య లేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని భర్తను లేపింది.

కాంతారావు కదలలేదు.

కౌసల్య "కెవ్వ" మంది.

ఆ కేకకి యింట్లో ఉన్నవారంతా పరుగెత్తుకొచ్చారు.

కౌసల్య జీవితం కూడా తెల్లవారింది.

---

# 3

కౌసల్య భర్త మరణించి అప్పుడే మూడు నెలలు దాటాయి.

కౌసల్య పుట్టింటికి పోలేదు. కన్నతండ్రి ఎప్పుడో చని పోయాడు. తల్లి అంతకుముందే దాటిపోయింది. ఉన్నదల్లా ఇద్దరు అక్కలు, ఇద్దరు అన్నలు.

అక్కలకేం అవసరం? విధవను తీసుకెళ్ళి విధిగా భరించవలసిన అగత్యం ఎవరికున్నది?

అన్నలు ఎందుకు సుఖంగాఉన్నా వదినలకి అలాంటి ఆలోచనలేమీ లేవు. భర్తలు చూచాయగా సూచించినా మందలించి ఊరుకున్నారు.

"కౌసల్యా, యింకా వంటకాలేదూ?" జానకమ్మ పూజామందిరం దగ్గరనుంచి కేక వేసింది.

"లేదత్తయ్యా, ఇవేళ ఒంట్లో బాగాలేదు.

"ఏం? ఏమైంది?" అన్నది సుమిత్ర కోపంతో."

"ఒళ్ళు తిరుగుతున్నట్లుంది. వికారంగా ఉంది. అక్కా, కాస్త పొయ్యిదగ్గిర కూర్చో. వాంతి అయ్యేట్టుంది" అంటూ కౌసల్య దొడ్లోకి వెళ్ళింది.

భళ్ళున వాంతి చేసుకున్నది.

చెయ్యా, ముఖం కడుక్కోవడానికి నీళ్ళు కూడా తెచ్చిచ్చే వారెవరూ లేరు.

మోహన్ స్నానం చేద్దామని దొడ్లోకి వచ్చేశాడు. వదినగారి పరిస్థితి చూచి భార్యని కేక వేశాడు.

"మాధవీ, వదిన వాంతి చేసుకుంటోంది నీళ్లు తెచ్చి యివ్వు."

మాధవి నీళ్ళచెంబు తీసుకొని రాబోయింది.

"ఏమిటి చెల్లీ ? ఎవరికి నీళ్లు" అన్నది సుమిత్ర.

"అక్కకి"

"ఏమైంది ?"

"వాంతి చేసుకొంటోంది."

"అయితే నిన్నెవరు నీళ్ళివ్వ మన్నారు? ఆవిడే అడిగిందా ?"

"ఊహు - ఆయన కేకవేసి చెప్పారు"

"బాగుంది. ఆవిడకు నోరులేదూ ? మధ్య మరిది కెందుకో బాధ ! నీకేమీ తెలీదు. భోళామనిషివి. మొగుడు మరో ఆడదానికి సేవ చెయ్యమంటే చెయ్యటమేనా ? ఆయనకు సిగ్గు లేకపోతే నీకయినా సిగ్గులేదూ.

మాధవికి ఒళ్లు మండింది.

చెంబు అక్కడే పారేసి తన గదిలోకి వెళ్ళిపోయింది.

మోహన్ గదిలోకి వచ్చాడు.

భార్య ముఖం చూచాడు.

"ఏం? వదినకి నీళ్ళివ్వలేదూ?"

"ఉహూ..."

"ఎందుకని?"

"ఎందుకివ్వాలి? ఆవిడకి కావలిస్తే అడగలేదూ. మధ్య నీకు దేనికి?"

"ఛీ... దుర్మార్గురాలా, ఆవిడ అనారోగ్యంతో తల క్రిందు లవుతుంటే మాట్లాడే దిలాగేనా? రేపు నీకేమైనా అయితే ఎవరూ ఏమీ చెయ్యక్కర్లేదా?"

"నిజమే. పొరపాటైంది. క్షమించండి, ఇంకెప్పుడూ ఇలా చెయ్యను."

"అయితే వదినని డాక్టరు దగ్గిరికి తీసుకెళ్ళు."

"ఎవరి దగ్గరకి?"

"డాక్టరు కమలాబాయి."

"అలాగే" నంటూ మాధవి కౌసల్యని వెతకటానికి వెళ్ళింది.

కౌసల్య వరండాలో ఓ మూల కాళ్లు ముడుచుకొని పడుకున్నది.

"అక్కా"

"ఎవరూ" అంటూ కళ్లు తెరిచి చూచింది కౌసల్య.

"డాక్టరు దగ్గరకి వెడదాం పద"

"దేనికమ్మా - అదే తగ్గిపోతుందిలే"

కౌసల్య నవ్వటానికి వ్యర్థ ప్రయత్నం చేసింది.

"ప్చ్. అలా ఎన్నటికీ తగ్గదు. అలా తగ్గేట్లయితే డాక్టర్లు ఇంత మంది దేనికి?" మాధవి గలగల నవ్వింది.

"దేనికమ్మా డాక్టరు మందు ఊరికే యిస్తుందా!"

"ఎందుకిస్తుందీ? ఆవిడకేమీ తోచక ప్రాక్టీసు చెయ్యటం లేదుగా డబ్బు లేకుండా ఎవ్వరూ మందివ్వరు."

"మరి నా దగ్గర డబ్బు లేదు కదమ్మా."

"నీ దగ్గర లేకపోతేనేం? మాదగ్గిర లేదూ?"

"ఉండదనికాదు, నాబోటి దౌర్భాగ్యురాలు బ్రతికి సాధించేది మాత్రం ఏముంది? అనవసరంగా డబ్బు పాడు చేసుకోవడం దేనికి?

"ఛీ... ఛీ... అలా అనకూడదు. డబ్బు సంపాదించేది దేనికి? ఉపయోగ పడటానికి కాదూ, ఖర్చుచేయటానికి కాకపోతే కూడబెట్టటందేనికి? ఆపదలో అక్కర కొస్తుందనే కదా."

"అవునమ్మా. అందుకని మీ ఆయన సంపాదించింది మరో అభాగ్యురాలి కోసం దుర్వినియోగం చేస్తావు. వద్దు, వద్దు, నామాటవిను, వెళ్ళిపో"

"ఊహూ. ఆయనకి కోపం వస్తుంది. రేపు నాకేదైనా వస్తే నీ విలాగే డబ్బు ముఖం చూచుకుని వైద్యం చేయించటం మానేస్తావా? చెప్పకూ. దీనికి సమాధానం కావాలి" అంది మాధవి గోముగా.

ఈ ప్రశ్నతో కౌసల్య నోరు కట్టుబడి పోయింది.

"సిత్రా! వాదించి లాభంలేదు చెల్లీ. సరే పద" అంటూ నిట్టూర్చి లేవటానికి ప్రయత్నించింది.

మాధవి పొదివి పట్టుకొని మెల్లగా నడిపించుకొని తీసుకు పోయింది కౌసల్యను.

"డాక్టర్, నమస్తే" అన్నది మాధవి చిరునవ్వు చిలికిస్తూ.

"నమస్తే, ఏమిటిలా వచ్చారు?" అన్నది డాక్టరు కమల తన దొండపండులాంటి పెదవులపై దరహాసాన్ని పులుముకొని.

"మా అక్కకి కులాసాగా లేదండీ. వాంతులవుతున్నాయి, ఒళ్ళు తిప్పుతోన్నదట"

"అలాగా, ఆ బల్లమీద పడుకోమ్మను. ఒక క్షణంలో వస్తాను ఈ యింజక్షను యిచ్చి."

మాధవి కౌసల్యని బల్లమీద పడుకోబెట్టింది.

డాక్టరు కమల చీరె తొలగించి కడుపుపట్టి చూచింది. మాధవివంక చిరునవ్వుతో చూస్తూ "మీ అక్కకేమీ వ్యాధి లేదమ్మా! అది సామాన్యంగా అందరు స్త్రీలకీ ఇలాంటి పరిస్థితిలో ఉండే అనారోగ్యమే."

"అంటే-" మాధవి తెల్లబోయింది.

"అంటే - మీ అక్క మరో ఆరు నెలలకి పండంటి పాపాయిని ప్రసవిస్తుంది."

"అలాగా?" మాధవి తడబడింది.

'ఏం? అలా కంగారుపడుతున్నావు! పిల్లలంటే యిష్టం లేదా?"

"అదికాదు - బావగారు చనిపోయి సరిగా మూడు నెలలు. అక్కకి - ఇదెలా సంభవం?"

"అంటే-" అన్నది డాక్టరు కమల ముఖం చిట్లించి.

"అంటే-ఏముంది? మా బావగారు వ్యాధితో మరణించాడు. అలాంటి స్థితిలో ... ఇదెలా సంభవం?" మాధవి కనుబొమలు ముడిపడ్డాయి.

"పిచ్చిదానా? ఎందుకు సంభవం కాదూ? మీ బావగారి బలవంతానికి ఆవిడ లొంగిపోయి ఉండకూడదా?"

"ఉహూ, అసంభవం. పైగా డాక్టరుగారు అలాంటివి జరగకూడదని ముందే హెచ్చరించారు. అది బావగారికే తెలుసు. కోరికోరి చావు లెవరైనా వరిస్తారంటూరా? నాకు నమ్మకం లేదు."

"ఏమో, అది మీ అక్కగార్నే అడగండి. కౌసల్య ముఖం పాలిపోయింది మాధవీ, కమలల సంభాషణ విన్నాక స్పృహ తప్పింది.

"వస్తానండీ డాక్టర్. మీ శ్రమకి ఇదిగో ఫీజు" అంటూ ఐదు రూపాయల కాయితం బల్లమీద పెట్టి మాధవి చరచరా వెళ్ళిపోతోంది.

"మాధవీ, ఒకమాట" అని డాక్టరు కమల పిలుస్తున్నా మాధవి వినిపించుకోలేదు.

"కౌసల్యా, ఏమిటిది?" అన్నది డాక్టరు కమల మాధవి ప్రవర్తన అర్థంకాక.

"నా ప్రారబ్ధం-పూర్వజన్మలో నేను చేసుకున్న పాపం" కౌసల్య పేలవంగా నవ్వింది.

"అంటే?-" కౌసల్య కళ్ళల్లోకి ప్రశ్నార్థకంగా చూస్తూ అన్నది కమల.

"అంటే అర్థం కాలేదా మీకు. మా వారు చని పోయి మూడు నెలలు. ప్రస్తుతం నాకు మూడు నెలలు. ఈ అవమానాన్ని, అనుమానాన్ని నా నెత్తిన రుద్ది ఆయన వెళ్ళి పోయారు. చేజేతులా ఆయన ప్రాణం తీసుకున్నారు. నా ప్రాణం పోవటానికి అవకాశం కల్పించి పోయారు. ఈ విషయం ఎవరితో చెప్పుకోను? డాక్టరు హెచ్చరించినా వినలేదు. నేను ప్రార్థించినా మానలేదు. పర్యవసానం ఈ పుట్టబోయే పాప. అనుమానానికీ, అవమానానికీ బలికాబో తున్న అమాయక జీవి. కడుపులో ఉండగానే కడగండ్లు ఆరంభమయ్యాయి" అంటూ నిట్టూర్చి లేవబోయింది కౌసల్య.

"అలాగా! దురదృష్టవంతురాలివి. జరిగిన విషయం ఎందుకు విప్పి చెప్పవు? ఈ అనుమానాన్ని ఎందుకు మొద ట్లోనే త్రుంచి వేయవూ?"

"ఎలాగు డాక్టర్? నేను చెప్పక ముందే మాధవి అసంభవమని కొట్టి పారెయ్యలేదా. రోగి అలా ప్రవర్తిస్తే డంటే మ్మనద్దా? ఒకరినని ఏం ప్రయోజనం! నా ప్రార

కాకపోతే! ఆయన బ్రతికి ఉండగానే ఈ పరిస్థితి సంభవించి ఉండకూడదూ? ఆయ నెంత సంతోషించేవారో! ఆయన చనిపోతూ తన చిహ్నాన్ని నాలో ప్రతిష్ఠించిపోయారు. ఎవరే మనుకున్నా భగవంతుడికి తెలియవా నిజానిజాలు?"

కౌసల్య గోడపట్టుకొని మెల్లగా లేచి నిలబడింది.

"సూరమ్మా, ఈమెని యింటిదగ్గర దింపిరా" అన్నది డాక్టరు కమల.

"మీకు దేనికిశ్రమ. మెల్లగా వెడతాలెండి". కౌసల్య నమస్కరించింది.

"ఇదికూడా శ్రమేనా? నా వృత్తి ధర్మం. మానవునికి కనీస ధర్మం. అంతకన్న మరేమీ లేదు" అంటూ నవ్వింది డాక్టరు కమల.

కౌసల్య సూరమ్మ సాయంతో ఇంట్లోకి అడుగు పెట్టింది.

---

# 4

"కౌసల్యా" అంటూ జానికమ్మ పిలిచింది.

"జానికత్తయ్యా" అంటూ కౌసల్య వడిగా వచ్చింది. అదిరే గుండెతో, బెదిరే చూపుల్తో అట్టే నిలబడి పోయింది తలవంచుకొని.

"నీవు మీ పుట్టింటికి వెళ్ళటం ఉత్తమం" అన్నది జానికమ్మ కౌసల్యవంక చురుకుగా చూస్తూ.

"ఎలా గత్తయ్యా?"

"ఎలాగేమిటి? ఉత్తరం వ్రాయించి పిలిపించుకో."

"వారు పోయినప్పుడు వచ్చి తీసుకుపోయేవారే లేరు. ఇప్పుడువచ్చి ఈ భారాన్ని నెత్తి కెత్తుకుంటారా వాళ్ళు?" కౌసల్య ముఖంలో దీనత్వం తొణికిసలాడుతోంది.

"పుట్టింటివారు నెత్తి కెత్తుకోకపోతే అత్తింటివారీ అవమానాన్ని భరిస్తా రనుకున్నావా? తోడబుట్టిన వాళ్ళకే పనికిరాకపోతే అత్తింటి వారి కేం పట్టింది. నీ మొగుడున్నంత వరకే నీ కిక్కడ స్థానం."

"ఆయన పోయారని నే నెక్కడికి వెళ్ళనత్తా? ఆద రించే వారుంటే వెళ్ళవచ్చు. కానీ నాబోటి దౌర్భాగ్యురాలి కంత భాగ్యమా?"

"అలాగని నున్నుల్ని నలుగుర్లో నవ్వులపాలు కమ్మంటావా? ఆలోచించుకో" అంటూ జానికమ్మ వెళ్ళి పోయింది చేతిలోని జపమాల త్రిప్పుకుంటూ.

కౌసల్య తూలి పడబోయింది. కానీ గోడని ఆసరా చేసుకుని మెల్లగా తన గదిలోకి వెళ్ళింది.

సామాన్లు సర్దుకున్నది. బట్టలు మరో సంచీలో సర్దింది. మెల్లగా బైటికి వచ్చింది.

సుమిత్ర ఎదురైంది. "ఎక్కడి కీ ప్రయాణం?" అంటూ ఆశ్చర్యం వెలిబుచ్చింది.

"ఏమో, భగవంతుడెటు తీసుకుపోతే అటు. చూడకొ. వళ్ళీ నే నే మైనా పట్టుకుపోతున్నానని వచ్చు" అంటూ సంచులు చూపించింది.

"ఊ, ఏమున్నాయి తీసుకుపోవటానికి" సంచులు రెండూ తీసి చూచింది. ఇంతలో మోహన్ వస్తున్నాడు.

"ఏమిటి వదినా చూస్తున్నావు?"

"కౌసల్య వెళ్ళిపోతున్నదయ్యా."

"ఎక్కడికి?" ఆశ్చర్యంతో కళ్ళింత చే చూచేడు.

"నేనూ అదే అడుగుతున్నాను. తెలీదంటూన్నది" అన్నది సుమిత్ర ముఖం చిట్లించి.

"ఏమీ తెలీకుండా ఎలా వెడుతుంది? అయినా యిప్పుడు వెళ్ళటం దేనికీ?"

"ఏమోనయ్యా, ఆ వివరాలన్నీ నాకేం తెలుసు? ఆవిడ్నే అడుగు."

"ఎక్కడికి వదినా వెళ్ళేది? నీ ఒక్క దానివే భారమవుతావా మాకు? అన్నయ్య సంపాదించినంత కాలం అందరూ కలిసి తినలేదూ?"

"ఏమీ లేదు బాబూ. ఆయన ఉన్నంతవరకే నాకిక్కడ స్థానం. ఇప్పుడాయన లేరు. సంపాదించి నన్నెవరు పోషిస్తారు బాబూ? ఎవరి సంసారాలు వారివి ఎవరి బాధలు

"అలాగంటే ఎలావదినా? అందరూ వేరుపడి ఉంటే రే సంగతి. అప్పుడు నీ సంగతి పట్టించుకోవలసిన అవసరం లేదు. కానీ ఇంతవరకూ ఉమ్మడిగానే ఉన్నాం. సంపాదించినా అంతా అమ్మకే యిచ్చాం. అలాంటి నీకుమాత్రం హక్కెందుకు లేదు?"

"ఈ విషయాలన్నీ ఇప్పుడెందుకు బాబూ. ఆయన అన్ని అధికారాలూ పోయాయి. ఇక జగడం దేనికీ? తే మనిషి పోగా లేనిది ఈ చిన్న చిన్న వాటికోసం చనా?"

"దేబిరించాల్సిన ఖర్మ నీకేం పట్టింది వదినా? నా ఉండు. అమ్మని అడిగి వస్తా."

"మధ్య నీకు దేనికయ్యా బాధ. ఆవిడ ఇష్టం వచ్చిన చోటికి ఆవిడ పోతుంది. ఆంక్ష పెట్టేటందుకు నీవెవ్వరు ? నేనెవ్వరురా ?"

"అంతే నంటావా వదినా? ఎవరూ శ్రద్ధపట్టకపోయినా స్వయముగా కల్పించుకొని తన స్వంత సంపాదనతో నన్ను చదివించి ఇంతవాణ్ని చేశాడు. నేను ఆయనకేమీ చెయ్యలేక పోయినా ఆయన కడుపునపుట్టే బిడ్డకీ, ఆయన్ని కట్టుకున్న భార్యకీ చేసి ఋణం తీర్చుకోలేనా ?"

"ఋణమా ? ఆయనకి బుద్ధి పుట్టి చదివించేడు. నీవు చదువుకున్నావు. ఆయన చదువు చెప్పించకపోతే నీవేం చేసే వాడివయ్యా ?"

"అదే నేనూ అడుగుతున్నా. అందులోనే ఆయన ఔదార్యం ప్రతిఫలిస్తోంది. అందుకే ఆయన కోరక పోయినా, వదిన అడ్డు చెప్తున్నా నేను పట్టు పట్టుతున్నది. వదినా! నీవు ఈ గడప విడిచిపెట్టి వెళ్ళావో నామీద ఒట్టే"

"అంతమాట అనకు మరదీ! పరిస్థితుల్ని బట్టి మసులుకోవాలి బాబూ. నామాట విను. నన్ను అడ్డగించకు. పోనీ—" కౌసల్య కంఠం పూడి మాటలు తడబడుతున్నాయి.

"ఏమిట్రా అది" అంటూ జానికమ్మ అక్కడికి వచ్చింది.

"ఏమీ లేదమ్మా. వదిన వెడతానంటుంటే వీలులేదం టున్నాను నేను"

"నీకేం తెలుసురా పిచ్చిసొయ్యా. అది వెడతానంటే వెళ్ళనీ" అన్నది జానికమ్మ నవ్వుతూ.

"ఊహూ. ఎక్కడికి వెడుతుంటామ్మా"

"వాళ్ళ అక్కల దగ్గరికో, అన్నల దగ్గరికో కావచ్చు."

"ప్చ్. లాభం లేదమ్మా. చెల్లెలిమీద అభిమానం ఉంటే వాళ్ళే పిలుచుకెళ్ళరా? పిలవకుండా వెళ్ళటం మంచిది కాదమ్మా. వాళ్ళు ఎంత నీచంగా చూస్తారో—" మోహన్ గొంతు బొంగురుపోయింది.

"తోడబుట్టినవాళ్ళే నీచంగా చూస్తారని భయపడితే పరాయివాళ్ళు బాగా చూస్తారంటరా. పిచ్చివాడా" జానకమ్మ గలగల నవ్వేసింది.

"అప్రయోజకయ్యా సరిదీ. మీ అన్నగార్లిద్దరూ ఊరు కంటే మధ్య నీ కేంపుకయ్యా" అన్నది సుమిత్ర.

పెద్దవాళ్ళు తప్పుచేస్తే అందరూ ఆ మార్గాన్నే అవలంబించాలా? నీకు తెలీదు వదినా, నీవూరుకుండూ. మీ కంత కష్టంగా ఉంటే నా సంపాదనలోనే పోషిస్తాను. అన్నకి పుట్టబోయే పాప పెద్ద వాడయ్యేదాకా వీళ్ళిద్దరి భారం నేనే వహిస్తాను" అన్నాడు మోహన్.

"ఊ, సరే" నంటూ మూతి త్రిప్పుకుంటూ వెళ్ళిపోయింది సావిత్రి.

"ఎలాగైనా పడవండి. ఈ కొంపలో పెద్దవాళ్ళమాట విందాం, చేద్దాం అన్న జ్ఞానం ఒక్కళ్ళకీలేదు. ఎవ కష్టం వాళ్ళది. సరే కానివ్వండి" అన్నది జానకమ్మ తన కోపాన్నంతా వెళ్ళ గ్రక్కలేక సతమతమవుతూ.

కౌసల్య భయపడుతూ భయపడుతూ వరండాలోనే ఉండిపోయింది. గదిలోకి వెళ్ళే ధైర్యంలేక సంచులు తలక్రింద పెట్టుకొని మేను వాల్చింది.

చల్లటి పైరుగాలి మెల్లగా వచ్చి జోకొట్టింది కౌసల్యని.

ఆరాత్రే సుమిత్ర మాధవరావుతో అన్నది.

"విన్నారా ?"

"ఏమిటో?" కనుబొమలు ముడిపడ్డాయి మాధవరావుకి.

"అదే—మీ మరదలు సంగతి—"

"ఏమరదలు ?" అర్థంకానట్లు చూచేడు భార్య కళ్ళల్లోకి.

"అబ్బ. ఏమీ తెలీనట్లు నటిస్తారేం ? మీ రెండో తమ్ముడి భార్య"

"ఆ, అయితే ఏమైంది ?"

"ఏమి కావాలో అదే అయింది. మూడు నెలల గర్భిణిట"

"ఎవరన్నారు ?"

"ఎవరేమిటి ? డాక్టరు కమల అన్నదట. మాధవి తీసుకుపోయి చూపించి వచ్చింది"

"అలాగా ? అయితే మంచిదేగా"

"నామ ఖంలా ఉంది. మరిది చనిపోయి మూడు నెలలైందిగా"

"అయితే—"

"మరీవిడకీ మూడు నెలలు."

"కావచ్చు"

"నాబొంద ఏ విషయమైనా మీతో చెప్పినా ఒకటే ఆగోడకి చెప్పినా ఒకటే—"

"అయితే మానెయ్యి. ఆ చెప్పదలచిం దేమిటో సూటిగా చెపితే అర్థమవుతుంది"

"అయితే మీకింకా అర్థం కాలేదన్నమాట. ఎంత బుద్ధి కుశలతగలవారండీ. మరిది రోగంతో చనిపోయాడుగా. అప్పుడే ఈవిడ పెద్దనెలలు పట్టి ఉంటుంది. ఈవిడకి మూడు నెలలు. దానికి కారణం మరిదేనని ఆవిడనమ్మించ చూస్తోంది. అర్థమైందా యిప్పటికైనా ?"

"ఆ"

"ఏమిటి దీని అర్థం ?"

"ఏముంది ? తమ్ముడు చనిపోయి మూడు నెలలు. మరదలికి మూడు నెలలు గర్భిణి. ఇది సంభవమే ఇందులో అనుమానించ వలసిందేమీ లేదు."

"నా తలకాయలాఉంది. మరిదికి రోగమయితే ఇవన్నీ అతగాడికి పట్టాయా? ఈ. డెలాఉ దో ఎవరికి తెలుసు? లా చిన్న తమ్ముడిమాటలు విన్నారా ?"

"నే నెప్పుడు విన్నాను ?"

"సరేలెండి. మీకు యింటి విషయాలు తెలుస్తాయా! అత్తగారు వెళ్ళిపొమ్మంది కౌసల్యని. కౌసల్య వెళ్ళనని మొండికేసింది. మరిది అడ్డంవచ్చాడు. ఎవరి కిష్టం ఉన్నా లేకపోయినా తన సంపాదనతో పోషిస్తాడట"

"అలాగా ?"

"అంతేనా ! పుట్టబోయే పిల్లవాడ్ని పెంచి పెద్దచేసి చదువు సంధ్యలు నేర్పిస్తాడట"

"మంచిదేగా ?"

"మీకు ఏమీ అర్థంకావు. అతనికేమీ భాగంతే పోతే ఎందుకు జోక్యంకల్పించుకుంటాడు ?"

"అవును. అదీ నిజమే వాడు వీడ్ని చదివించాడు. ఆ కృతజ్ఞతతో చేస్తానంటున్నాడేమో"

"నా బొంద. ఇంతస్పష్టంగా కన్పిస్తున్నా కృతజ్ఞతలు, దయా దాక్షిణ్యాలు మీకుతోస్తాయి. స్వార్థమేమీ లేకుండా కేవలం కృతజ్ఞతతో ఎవరైనా ఇంత భారము నెత్తినేసు కుంటారంటారా ?"

"కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగానే ఉంటుంది" అంటూ నవ్వాడు మాధవరావు.

"అంటే -? మీ ఉద్దేశ్యం? నేను కామెర్లరోగిననా?" కోపంతో పెదవులు వణికేయి సుమిత్రకి.

"అబ్బే! ఎవరన్నారు? ఊరికే సామ్యం చెప్పాను. రోగం నీకున్నదని కాదు. స్వార్థపరులకి లోకమంతా స్వార్థంతో నిండినట్లుగానే కనిపిస్తుంది."

"అవునవును" పెద్ద దయాపరులు బయలుదేరారు. ఇంకేం, మీరుకూడా పాపం మీ చిన్నతమ్ముడి భారంలో సగం పంచుకోండి. నిస్వార్థ జీవులు" హేళనగా నవ్వింది సుమిత్ర.

"అబ్బ! వాదనలకేమిగాని నాకు నిద్రొస్తోంది. వస్తావా లేక లోకమరమ్మత్తుని గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చుంటావా!"

"ఎల్లి ఎందుకలా తప్పుకుంటూరు. దేనికీ సూటిగా సమాధానం చెప్పరేం?"

"ఏం చెప్పమంటావు?"

"ఆవిడిక్కడఉంటే మనకు అప్రతిష్ట కాదూ! ఆవిడ్ని పంపించటానికి ప్రయత్నం చెయ్యరేం."

అందరికీలేని పరువు ప్రతిష్టలు నీకొక్కదానికే వచ్చాయా? అయినా ఆవిడ బరువు నీవేం మోస్తునావని ఇంతగా బాధపడిపోతావ్? ఆ బాధంతా నీ చిన్న తోడికోడలికి వదలిపెట్టు" గలగల నవ్వేడు మాధవరావు.

"నా ముఖం. దానికంత తెలివితేటలు కూడానా? మొగుడు డాక్టరికి చూపించి రమ్మన్నాడట. ఈ విడకూడా వెళ్ళి చూపించివచ్చింది. భర్తపోషిస్తానని అంటుంటే పల్లెత్తి మాట్లాడదు. "ఏదో స్వంత అక్కగారు బాధపడిపోతున్నట్లు

చూస్తుంది. స్వంత అక్కగారి బాధ్యత తన నెత్తిన పడ్డట్లే ప్రవర్తిస్తుంది. అంతేకాని పరాయి స్త్రీ విషయంలో భర్త యింత స్వతంత్రించి డబ్బు ఖర్చుచెయ్యబూనుతుంటే మాటమాత్రమైనా ఎదురుచెప్పదు. ఒట్టి అమాయకురాలు. ఎవరైనా విప్పిచెప్తే విని తల ఆడిస్తుంది. అంతేగాని స్వయంగా ఆలోచించుకోదు. తానుగా ఏదీ నిర్ణయించుకోలేదు. అందుకే కౌసల్య ఆటలు సాగుతున్నాయి"

"ఊరికే ఇతర్లని నిందిస్తే నీకు ఒరిగేదేమిటి చెప్పు. నిజమెంతో అబద్ధమెంతో నీవు చూచావా? చెప్పు. ఊహాగానాలుచేసి పరుల ఊపిరెంచుకు తీస్తావు?"

"అవును. అనండి. అందరూ నన్నే అనండి. మీరంతా పవిత్రులు. నేనే అందరికి అపవాదులు అంటగట్టి అవమానం పాలు చేస్తున్నాను. సరే, నాదేంపోయింది. ఇంకా నాలుగు రోజులుపోతే మీకే అర్థమవుతుంది" అంటూ సుమిత్ర చెంగుపరుచుకొని మోచెయ్యి తలక్రింద పెట్టుకొని పడుకున్నది.

"ఈ అలగటం దేనికి? లోకాభి రామాయణం ఎవరు చెప్పమన్నారు? ఎవరు మూతి ముడుచుకోమ్మన్నారు?"

"లోకాభిరామాయణమా? అవును మీకే కొంపలో జరిగే విషయాలన్నీ కాలక్షేపానికి చెప్పే కథలుగానే కనిపిస్తాయి."

"సరే. ఇంతకీ ఇలా వస్తావా? అలా కొంగుపరుచుకొని కోపం అభినయిస్తావా? ఏదో ఒకటి తేల్చు. నాకు నిద్ర ముంచుకొస్తోంది. నీకేం, పగలు నిక్షేపంగా నిద్రపోతావు. పగలంతా పనిచేసి, అలిసి, సొలిసి వస్తే అనవసర ప్రసంగాలు తెచ్చి అవస్థ పెడతావు; అవస్థపడతావు. దేనికో చెప్ప రాదూ?"

"నా వన్నీ అనవసర ప్రసంగాలేలెండి. ఇక ఘర్షణ దేనికి? నిద్రపోండి. నాకూ నిద్రవస్తోంది." అంటూ సుమిత్ర కళ్ళు మూసుకున్నది.

---

# 5

సుమిత్రకి ఉక్రోషం వచ్చింది కానీ ఎవరిమీద ప్రదర్శిస్తుంది?

"అక్కా, కూరలు తరగనా" అంటూ కౌసల్య వంటింట్లోకి వచ్చింది.

"దేనికమ్మా, నీవెళ్ళి అవతలకూర్చో, నీవు చెయ్యి పెడితే మీ బావగారు తినరు." అన్నది సుమిత్ర కత్తిపీట ముందువేసుకొని కూర్చుంటూ. కౌసల్య మనస్సు చివుక్కు మంది. ముఖం చిన్నబోయింది.

కౌసల్య దొడ్లోకి వెళ్ళి పంపుదగ్గర మాసిన బట్టలుంటే వాటికి సబ్బు పెడుతున్నది. మాధవి దొడ్లోకివచ్చింది.

"లేవమ్మా, లే. దేనికి నీ కా శ్రమ. వెళ్ళికూర్చో" అంటూ చేతిలో బట్టలు ఊడలాక్కుని పంపుదగ్గర చతికిల పడింది మాధవి.

కౌసల్య మెల్లగా వెళ్ళిపోయింది. ఆమెను ఏవనీ ముట్టనివ్వటంలేదు? మాట్లాడేవా రెవరూ లేరు. ప్రొద్దెలా గడుస్తుంది?

కౌసల్య తనగదిలోకి వెళ్ళి కూర్చుంది. పాతచీరలన్నీ తీసి చినుగులు కుట్టింది. వాటన్నిటితో చిన్న చిన్న మెత్తలు కుట్టింది.

పుట్టబోయే పాప ఆడో, మగో ఎవరికి తెలుసు?

ఎవరైతేనేం? చిన్న స్వెట్టరూ, మేజోళ్ళూ, టోపీ అల్లితే బాగుండదూ?

కానీ ఊలు లేదే!

ఎవరు తెచ్చి పెడతారు?

మరిదిని అడిగితే!

ఏమనుకుంటాడో?

ఏమనుకుంటాడు?

ఏమీ అనుకోడు—

కౌసల్య దొడ్లోకి వెళ్ళింది.

"మాధవీ"

"ఏం?" మాధవి ముఖం చిట్లించి అడిగింది.

"నాకో ఉపకారం చేసి పెట్టమ్మా?"

"ఏమిటది?"

"మరిదిగారిచేత ఊలు తెప్పించి పెట్టమ్మా?"

"ఏం? నేరుగా ఆయన్నే అడిగి తెప్పించుకో?"

"ఎలా అడగనూ?"

"ఎందు కడగకూడదూ?"

"తప్పుకాదా? ఎవరైనావింటే ఏమనుకుంటారు?"

"ఏమీ అనుకోరు. ఇంత జరిగినా ఏమీ అనుకోని వాళ్ళు దీనికి మాత్రం ఏమనుకుంటారు?" మాధవి హేళనగా నవ్వింది.

"మా తల్లివికదూ. ఈ ఒక్క సాయం చేసిపెట్టు. ఏపని చేద్దామన్నా ఎవరూ దగ్గరికి రానివ్వడంలేదు. కాల మెలా గడుస్తుంది?"

"ఎలాగైనా గడుస్తుంది. ఇన్ని అవస్థలు పడుతూ యిక్కడ ఉండకపోతే మీ పుట్టింటికి వెళ్ళకూడదూ?" మాధవి కౌసల్య కళ్ళల్లోకి చూస్తూ అన్నది.

"వెళ్ళటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని అక్కడ పరిస్థితి యింత కంటే విషమిస్తే -"

"ఎంతైనా రక్త సంబంధం కదా -"

"డబ్బుదగ్గర అందరూ ఒకటే. శాశ్వతంగా ఎవరు భరిస్తారు?"

"మరి యిక్కడ మాత్రం ఎవరు భరిస్తారు?"

"అవును. అదీ నిజమే -"

"మరి ఏదైనా ఆలోచించేవా?"

"ఊహూ. లేదు. ఆలోచించాలి. నా అంతట నేను స్వయంగా బ్రతక కలిగే ఉపాయంగా ఆలోచించాలి"

"అవును. అదే మంచిది."

"అయితే నేను చెప్పిన మాట మర్చిపోవుకదూ?

"ఊఁ"

"అయితే. ఇదిగో డబ్బు."

"డబ్బు దేనికీ? మీ. మరిది కోప్పడతారు"

"డబ్బు యివ్వకుండా తెప్పించుకోవటం నా కిష్టం లేదు"

"అయితే ఎలా?"

"ఇది నీదగ్గరే ఉంచు. అతనికి చెప్పకు" అంటూ మాధవి చేతిలో పెట్టింది.

మాధవి నోటుతీసి కొంగున కట్టుకున్నది. గదిలోకి వెళ్ళింది. మోహన్ దుకాణానికి వెళ్ళటానికి తయారవుతున్నాడు.

"ఏమండీ"

"ఏమిటీ?" వెనక్కి తిరిగి చూచేడు.

"ఒక పని చేసిపెట్టాలి"

"ఏమిటో?"

"ఊలు తెచ్చి పెడ్తారా?"

"దేనికట?"

"పని ఉన్నదని చెప్పలేదూ?"

"ఏమిటో సెల విప్వందే ఎలా తెచ్చేది?"

"నాకు కాదు లెండి"

"మరెవరికి?"

"మీ వదిన గారికి"

"ఏ వదినగారికి ?" ఆశ్చర్యంతో మాధవి ముఖంలోకి చూచేడు.

"ఇంకెవరు ? మీ ప్రియమైన వదిన కౌసల్యకి."

"దేనికట ?"

"తోచడం లేదట"

"అయితే -"

"పుట్టబోయే పాపకి అల్లుకుంటుంది కాబోలు" ఫక్కున నవ్వింది మాధవి.

"అలాగా ? అయితే సరే"

"అదుగో చూచేరా ? అదే నాకు కావాలంటే తెచ్చి పెట్టేవారేనా ?"

"ప్చ్. ఎప్పుడైనా నీవు కోరిన వస్తువు తెచ్చిచ్చానా?" కోపం అభినయించేడు మోహన్.

"ఊరికే అన్నాను లెండి. పాపం ప్రొద్దు పోవటం లేదట. మరీమరీ బతిమిలాడి చెప్పింది. మర్చిపోకండి"

"అలాగే" నంటూ మోహన్ వెళ్ళి పోయాడు.

భోజనాల వేళకి మోహన్ దుకాణంనుండి తిరిగి వచ్చేడు.

"మాధవీ"

"____"

"ఓ మాధవీ"

"... ..."

మోహన్ నంటింటి నైపు వెళ్ళాడు. సావిత్రి అక్కడ కనిపించింది.

"వదినా"

"దేనికి బాబూ"

"మాధవి లేదూ?"

"స్నానం చేస్తున్నట్లుంది"

"అలాగా. అయితే—" అంటూ నీళ్ళు నమిలేడు మోహన్.

"ఆ పొట్లం ఏమిటయ్యా?"

"ఊలు"

"ఎవరికీ"

"చిన్న వదిన కావాలన్నదట"

"అలాగా. ఏదీ? ఇలా యివ్వు" అని పొట్లం విప్పి చూస్తోంది.

"ఏమిటదీ" అంటూ సుమిత్ర వచ్చింది.

"ఏమీ లేదు. ఊలు"

"ఎవరు తెచ్చారు?"

"చిన్న మరిది"

"ఎవరికోసం"

"కౌసల్య కోసం"

"ఓహో! అలాగా? ఏది-ఇలా తే" అంటూ సుమిత్ర ఊలు పొట్లం చేతికి తీసుకుంది. కాయితం చింపి చూసింది.

"బాగున్నదయ్యా. ఎన్నాళ్ళబట్టి మీ అన్నగార్ని అడుగుతున్నాను. ఇదుగో, అదుగో అంటారే కాని తెచ్చివ్వరు. ఈ ఊలు నేను అట్టే పెట్టుకుంటానయ్యా. డబ్బులు తర్వాత యిస్తాలే" అంటూ వూలుపొట్లం పట్టుకు పోయింది సుమిత్ర.

మోహన్ ముఖం కోపంతో జేవురించింది. కానీ ఏం చేస్తాడు?

చప్పున వెనుతిరిగి తన గదిలోకి వెళ్ళిపోయేడు.

"ఏమండీ ఊలు తెచ్చేరా" అన్నది అప్పుడే గదిలోకి అడుగుపెట్టిన మాధవి.

"మర్చిపోయాను"

"ప్రొద్దున అన్నిసార్లు చెప్పాను. వదినొస్తే ఎలా? ఆవిడ అడిగితే ఏమని చెప్పను?

"మర్చిపోయానని చెప్పు"

"బాగుంది" మాధవి మూతి ముడుచుకున్నది.

"సరే, భోజనానికి పదండి."

"వూ" అంటూ మోహన్ కదిలేడు.

మోహన్ సాయంత్రం దుకాణంనుంచి వస్తూ ఊలు పట్టుకొచ్చేడు.

నేరుగా కౌసల్య గది దగ్గరికి వెళ్ళేడు.

"వదినా"

"ఊ" అంటూ కౌసల్య ఉలిక్కిపడి చూచింది.

"ఎవరూ?" అన్నది ఆశ్చర్యంతో.

"నేనే వదినా-పూలు కావాలన్నావుట. ఇదుగో" అంటూ పొట్లం అందిస్తున్నాడు.

"ఎవరక్కడ?" అన్న సుమిత్ర కేకకి మోహన్ ఉలిక్కిపడ్డాడు.

"నేనే" అంటూ తడబడుతూ చెప్పాడు.

"ఏం చేస్తున్నావయ్యా అక్కడ చీకట్లో? అంటూ లైటు వేసింది సుమిత్ర.

వెలుగుతో వరండా తెల్లగా వెలిగింది. మోహన్ ముఖం వెలవెల బోయింది.

"ఏమి చేస్తున్నావయ్యా" మళ్ళీ రెట్టించింది సుమిత్ర.

"వదిన——వదిన" అన్నాడు అంతకు పైన చెప్పటం ఇష్టం లేక.

ఇంతలో మాధవి అక్కడికి వచ్చింది.

"ఏమిటండీ" అన్నది కోపంగా చూస్తూ.

"ఏమీ లేదు ఊలు" అంటూ నణిగేడు మోహన్.

"ఓహో! అదా! నా చేతికిస్తే నే నివ్వక పోయానా? అంత రహస్యముగా తెచ్చివ్వవలసిన అవసర మేమొచ్చింది? మరి ఏమీ తెలేని నంగనాచిలా ఆవిడ నాతో మొరపెట్టు కుంటుంది దేనికీ? తానే స్వయంగా అడగవచ్చుగా" మాధవి పెదవులు అదురుతున్నాయి.

"లేదు......లేదు" ఏదో చెప్పబోయాడు మోహన్.

"మీరేమీ దాచనక్కర్లేదు. అక్క అడగబట్టేగా యిది బైటపడింది. ఇంకా ఏమేమి తెచ్చిస్తున్నారో."

"ఏమీలేదు మాధవీ" వివరించబోయాడు మోహన్.

"మీరేమీ కల్లబొల్లి కబుర్లుచెప్పి నన్ను నమ్మించనక్కర్లేదు. నేనేమీ పసిపిల్లని కాదు" అంటూ ఏడుస్తూ మాధవి చరచర లోపలికి వెళ్ళిపోయింది. మోహన్ మెల్లగా మాధవి ననుసరించేడు తడబడే అడుగుల్తో.

సుమిత్ర పెదవులపై చిరునవ్వు తొంగి చూసింది.

ఏమీ ఎరగని దానిలా కౌసల్య గదిలోకి వెళ్ళింది.

"కౌసల్యా"

కౌసల్య అంతవరకూ బిత్తరపోయి అలాగే చూస్తున్నది. ఉలికిపడి చూచింది. ఎదురుగా సుమిత్ర.

"ఏమిటక్కా"

"ఏమిటమ్మా ఆ పొట్లం ?"

"మరిది తెచ్చాడు"

"ఏమిటది?"

"ఊలు"

"ఎవరడిగేరు ?"

"నేను మాధవితో చెప్పేను తెప్పించి పెట్టుమని. మరిదే స్వయముగా తెచ్చి యిచ్చేడు. ఇదీ నేను చేసిన నేరం"

కౌసల్య కళ్ళల్లో బాధ సుళ్ళు తిరిగింది. జొటజొట నీరుకారింది.

"ఏదీ ? నన్ను చూడనీ" అంటూ పొట్లం విప్పింది.

మరో రంగు ఊలు. మెత్తగా సన్నగా నాజూగ్గా ఉంది.

"ఏం చేస్తావు దీనితో" కౌసల్య కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"స్వెటర్ అల్లుదామని"

"ఎవరికి?"

కౌసల్య సిగ్గుపడింది. మాట రాలేదు,

"ఏం? పలకవేం ఎవరికీ?"

"..................."

"నీను పుట్టబోయే పాపకా?" సుమిత్ర గలగల నవ్వింది.

కౌసల్య ముఖం కందగడ్డ అయింది.

"అవునా?"

"ఊఁ"

"అప్పుడే అంత తొందర దేనికీ? నాకో సాయం చేసి పెడ్తావా?"

"ఊఁ"

"నాదగ్గర ఊలుంది. అదీ ఇదీ కలిపి మా రంగడికి అల్లి పెట్టు. నేను మళ్ళీ తెప్పించి యిస్తాలే. భయపడకు"

కౌసల్య అడ్డు చెప్పాలని అనుకుంది. కానీ భయంతో సందేహంతో నోటమాట పెగలలేదు.

"ఏం? సందేహిస్తున్నావా?"

"ఉహుూ"

"అయితే మరేమిటి ఆలోచన" అంటూ చరచర వెళ్ళి ప్రొద్దున మోహన్ దగ్గర తీసుకున్న ఊలు పొట్లం రంగడి ఆదిబనీనూ తెచ్చి పడేసింది.

కౌసల్య చిన్నబోయింది. కానీ తమాయించుకుంది.

"ఏం? అల్లుతావు కదూ?"

"ఊఁ"

"సుమిత్ర చేటంతముఖంతో పైటికి వెళ్ళింది.

సావిత్రి ఎదురుపడింది.

"ఎక్కడికి కెళ్ళావు?"

"కౌసల్య దగ్గరికి"

"దేనికి"

"దాని తిక్క కుదర్చటానికి"

"ఏంచేశావేం?"

"ఏమిటా! ప్రొద్దున చిన్నమరిది ఊలు తెచ్చాడు ఆవిడకోసం. అది నేను అడిగి పుచ్చుకున్నాను. మళ్ళీ సాయంత్రం స్వయంగా తనేవచ్చి యిచ్చిపోతున్నాడు. ఈసారి ఆవిడనే అడిగి పుచ్చుకున్నాను" అన్నది విజయ గర్వంతో పకపక నవ్వుతూ.

"ఏమిచేస్తావు? నీకు అల్లటమురాదుగా?"

"నాకురాదులే. ఆవిడనే మా రంగడికి అల్లిపెట్ట మన్నాను. బాగా కుదిరింది రోగం. ఏమంటావు?"

"పాపం! ఆవిడ తెప్పించుకున్నది దేనికి తీసుకోవటం? బావగారిచేత చెప్పించుకోక పోయావా?"

"అదుగో ఆ పిచ్చిమాటలే వద్దన్నాను. లేకపోతే ఆ మరిదికేం పిచ్చా? ఆవిడ అడిగినవన్నీ సమకూర్చటానికి-"

"అతని కిష్టమైంది తెచ్చిచ్చాడు. మధ్య మనకు దేనికి"

"అంతేనా? అలా ఊరుకుంటే రేపు యిల్లంతా దోచి ఆవిడకి పెడతాడు. అప్పుడూ ఊరుకుంటావా? మొదట్లోనే బుద్ధిచెప్పాలి"

"బుద్ధిచెప్పటానికి మనమెవరం? అతని సంపాదనలో అతను కొనిస్తే వద్దని చెప్పటానికి మనకేం హక్కున్నది?"

"ఎందుకు లేదూ? కూడనిపని చేస్తూ ఉంటే కిమ్మనకుండా ఎలాఉంటాం? అతనికి తెలీకపోతే తెలియజెప్పే బాధ్యత మనకున్నది."

"అతని భార్యే-ఊరుకుంటే మధ్య మనకు దేనికి? ఆవిడకులేని కష్టం మనకెందుకు?"

"అది ఒట్టి పిచ్చిమొద్దు, వెర్రిబాగులది. అందుకే వాళ్ళిద్దరూ యిష్టమొచ్చినట్లు ఆడుతున్నారు"

"ఉహూ - నేను నమ్మను"

"నమ్మకపోతే ఊరుకో"

"అవును అదేమంచిది" అంటూ సావిత్రి వెళ్ళిపోయింది.

---

# 6

"మాధవీ" మోహన్ పిలిచేడు.

"దేనికీ ?"

"వదిన కనిపించటంలేదే-"

"ఏ వదిన?" మాధవి ప్రశ్నార్థకంగా భర్త కళ్ళల్లోకి చూచింది.

"కౌసల్య..."

"ఏమో..."

"అంటే ! ఏమైంది ? ఆతృతతో ప్రశ్నించేడు మోహన్.

"అంత ఆతృతదేనికో ?—" మాధవి హేళనగా నవ్వింది.

"ఎలాఉందో చూచిరా" మోహన్‌కి మాధవి మాటల్లో ధ్వనించిన హేళన అవగతం కాలేదు.

అతనిదృష్టి అక్కడలేదు.

"మీరే వెళ్ళి పలకరించ కూడదూ ? మధ్య నా రాయబారం దేనికి ?"

"నేను పలకరిస్తే బాగుండదేమోనని. వదిన నొచ్చుకుంటుంది."

"ఇదో ఉద్యోగం నాకు –" మోహిని విసుక్కుంది.

"ఇంతమాత్రానికే విసుగుదల దేనికి? సరే – అయితే, నేనే చూస్తానులే" అంటూ చరచర వెళ్ళేడు మోహన్.

"వదినా—" గడప దగ్గర నిలిచి పిలిచేడు.

"… … … … …"

"వదినా" రెండోమారు గట్టిగా పిలిచేడు.

"ఊ" అన్నది కౌసల్య కప్పుకున్న దుప్పటి తొలగించి చూస్తూ.

"ఏమిటలా పడుకున్నావు? సుస్తీగా ఉందా."

"ఆ, ఏమీ లేదు. కాస్త జ్వరంగా ఉంటేను—"

"ఎన్నాళ్ళబట్టీ?"

"ఓ పదిరోజులనుంచి"

"అయితే అలాగే ఊరుకున్నావేం? డాక్టరుకి చూపించుకోకూడదూ?" నిష్ఠురంగా అన్నాడు.

"నాదగ్గర డబ్బేదీ?" పేలవంగా నవ్వింది కౌసల్య.

"ఆ మాటే అనవద్దన్నాను. మేమంతా చచ్చామా?" మోహన్ కంఠములో కోపం కొట్టొచ్చినట్లు తెలుస్తుంది.

"అంత మాటెందుకు బాబూ. అదే తగ్గిపోతుందిలే. అంతగా తగ్గకపోతే అప్పుడు చూచుకోవచ్చు" కౌసల్య లేచి కూర్చోబోయింది.

"ఊహూ, అంతవరకూ చూస్తే గొంతు మీదికొస్తుంది. మొదట్లో తుంచివేయటమే శ్రేయస్కరం"

"అయితే ఒక పని చెయ్యి బాబూ, రేపు ధర్మాసుపత్రికి తీసుకుపో"

"అంత ఖర్మమే మొచ్చింది? డాక్టరు కమల దగ్గర చూపించుకోరాదూ?"

"మిమల్ని శ్రమపెట్టటం నా కిష్టంలేదు. పైగా నాకు యిక్కడ సేవ ఎవరు చేస్తారు బాబూ. కాస్త ఆలోచించి చూడు".

"అవును. నీవన్నమాటా నిజమే" మోహన్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"రేపు తీసుకెడతాలే వదినా. ప్రొద్దునే సిద్ధంగా ఉండు"

"అలాగే" అంటూ కౌసల్య మరలా ప్రక్కమీదికి ఒరిగిపోయింది.

---

# 7

ప్రొద్దున్నే రిక్షా తెచ్చి బైట నిలబెట్టాడు మోహన్. కౌసల్య గది దగ్గరికిపోయి కేక వేశాడు.

"వదినా -"

"ఊఁ" నీరసంగా వచ్చింది సమాధానం.

"లేచి వస్తావా? రిక్షా తెచ్చేను."

"ఊఁ" కౌసల్య లేవటానికి ప్రయత్నించింది. బలమంతా ఉపయోగించి లేచి నిలబడింది. గోడ ఆసరాతో మెల్లగా బైటికి రాబోయింది. తూలిపడిపోయింది. తలకి పెద్దగాయమే తగిలింది. బొలబొల రక్తం చిమ్మింది.

"వదినా -" బాధతో కేక వేసేడు మోహన్.

ఇంట్లో వాళ్ళంతా బైటికి వచ్చి నిలబడ్డారు. కానీ ఎవ్వరూ, కౌసల్యని లేవదీయటానికి ప్రయత్నించలేదు. అట్టే నిలబడి చూస్తున్నారు.

మోహన్‌కి మనస్సు భగ్గుమన్నది. ఆపదలోకూడా ఆలోచనలేనా?

"రిక్షా, ఓరిక్షా" అంటూ కేక వేసేడు. రిక్షావాడు పరుగెత్తుకొచ్చేడు లోపలికి.

"అయ్యో బాబోయ్. ఆవిడ పడిపోయారే" అంటూ దగ్గరకొచ్చేడు.

"కాస్త సాయంపట్టు" అన్నాడు మోహన్.

"ఆడ కూతురు గాదా? నేనెట్టా తాకేది బాబూ. ఆరిని పిలవండి. అమ్మా, కూసెంత సాయం పట్టండి. రిక్షా లోకి ఎక్కిద్దాం"

"నేను మడి కట్టుకున్నానయ్యా" అన్నది జానికమ్మ.

"నేను పిల్లలికి అన్నం పెడుతూ వచ్చాను. నాది ఎంగిలి చెయ్యి" అన్నది సుమిత్ర. మిగతావాళ్ళు మాట్లాడ లేదు.

సావిత్రి ముందుకొచ్చింది. ఒక్కరెక్క తాను పట్టుకున్నది.

రిక్షావాడు రెండో రెక్క పట్టుకున్నాడు.

ఇద్దరూ కలిసి అతిప్రయాసతో రిక్షా ఎక్కించేరు కౌసల్యని.

కౌసల్యకి స్పృహా లేదు.

ఎవరైనా పట్టుకోవాలి.

ఎవరు పట్టుకుంటారు?

మాధవి రాకూడదు.

"మాధవీ" కేకేసేడు మోహన్.

మాధవి రానేలేదు బైటికి.

మోహనకి అంతులేని కోపం వచ్చింది: వీళ్ళంతా మనుష్యులేనా ?

మానవ జాతిమీదనే అసహ్యం కలిగింది మోహన్‌కి.

ఎక్కి రిక్షాలో కూర్చున్నాడు. కౌసల్యని పట్టుకున్నాడు.

“పోనీకోయ్ రిక్షాని”

“ఎక్కడికి బాబూ”

“ఉస్మానియా హాస్పిటల్‌కి”

“చిత్తం” రిక్షావాడు ఎత్తుపల్లాల్లో జాగ్రత్తగా తొక్కుతూ చేతనైనంత త్వరగా పోనిస్తున్నాడు.

“బాబూ, ఆస్పత్రి వచ్చింది”

“ఆపు” అంటూ తాను దిగేడు ముందు. రిక్షావాడి సాయంతో కౌసల్యని క్రిందకి దించేడు.

హాస్పటల్‌కి వెళ్ళి డాక్టరుకి కౌసల్య పరిస్థితి వివరించేడు.

ఒక చక్రాల బండి తీసుకొచ్చేరు యిద్దరు దాయీలు.

కౌసల్యను ఎత్తి దానిమీద పరుండబెట్టేరు.

మోహన్ “అడ్మిషన్” గదికి వెళ్ళి కౌసల్యని అడ్మిట్ చేసినట్లు “టిక్కెట్టు” వ్రాయించి చక్రాలబండి ననుసరించేడు.

బండి నేరుగా స్త్రీల కాన్పుల వార్డుకి వెళ్ళింది. బెడ్ మీద కౌసల్యని దింపేరు.

"సిస్టర్. ఈమెకేమైనా యివ్వాలా?" మోహన్ ఆదుర్దాగా అడిగేడు.

"ఏమీ వద్దు. ముందు డాక్టర్ని వచ్చి పరీక్ష చెయ్యనివ్వండి. ఆయన ఎలా చెబితే అలా చెయ్యవచ్చు" అంటూ సిస్టర్ వెళ్ళిపోయింది.

పదిహేను నిముషాల తర్వాత డాక్టరు వచ్చేడు. నాడి పరీక్షించేడు, "టికెట్" పుస్తకం తెరచి ఏదో రాసేడు. సిస్టరుకి ఏవేవో చెప్పి వెళ్ళిపోయేడు.

సిస్టర్ టికెట్ చూచింది.

ఇంజక్షన్ ఇచ్చింది.

కౌసల్య కాసేపటికొంత సేపటికి కళ్ళు తెరచింది.

సిస్టర్ నీళ్ళు గొంతులో పోసింది.

కౌసల్య గుటక వేసింది. కళ్ళు విప్పి కలియచూసింది.

"బాబూ"

"ఊఁ, ఏం కావాలి వదినా?"

"ఎక్కడున్నాను నేను?"

"హాస్పిటల్లో"

"వూ——"

"ఇక్కడే వుంటారు?" మోహన్ వంక చూచి అడిగింది సిస్టర్.

"ఎవరూ లేరమ్మా"

"అయితే ఎలా? ఎవరినైనా ఉంచండి"

"ఆమె కెవరూలేరు సిస్టర్" మోహన్ గొంతు పూడుకుపోయింది.

"మరైతే ఎలా?" ఎవరినైనా కూలిమనిషిని పెట్టండి" అంటూ సిస్టర్ వెళ్ళిపోయింది ఎత్తుమడమల బూట్లతో టకటకా గంగా నడుస్తూ.

"ఏమిటి బాబు?" అన్నది ప్రక్క బెడ్ దగ్గరున్న ఓ స్త్రీ.

"ఏమి లేదమ్మా, ఈమె కెవరూ లేరు. ఎవరినైనా దగ్గరుంచ మంటోంది సిస్టర్" మోహన్ విచారంగా అన్నాడు.

"మీరేం దిగులు అక్కర్లేదు బాబూ. ఇక్కడున్నంత వరకూ నేను కనిపెట్టి ఉంటాను" అన్నది ఆ స్త్రీ.

"అంతకంటేనా? నీ మేలు మరిచిపోను అమ్మా. ఇంద ఈ పదిరూపాయలు ఉంచు" అంటూ మోహన్ నోటు తీసి ఆవిడ కివ్వబోయేడు.

"ఈపాటి సాయానికే డబ్బుదేనికిబాబూ? పైస వస్తుంది, పోతుంది. మాట ఒక్కటే మిగిలేది" అన్నది ఆ స్త్రీ.

"ఆ బెడ్ మీద ఉన్నది ఎవరు? అన్నాడు మోహన్.

"మా అమ్మ"

"ఏమైంది?"

"తల పగిలింది"

"ఎలా పగిలింది?"

"ఎంచుకుంటే మంచమంతా కంతలే బాబూ. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది" అన్నది ఆ స్త్రీ ఏడుస్తూ.

"ఎవరు కొట్టారు ?"

"ఎవరోనా ? పరాయివాళ్ళెవరూ కాదు బాబూ. నన్ను కట్టుకొన్న నా మొగుడే ఇంతపని చేసేడు"

"ఎందుకూ ?"

"అడిగితే డబ్బివ్వ లేదని—"

"అందుకే కొట్టాడా ?"

"అవును బాబూ. మా అమ్మ, అయ్యకి నేనొక్కర్తినే బిడ్డని. అందుకని ఇల్లటం అట్టేపెట్టుకుంటే ఇదీ తం... నలుగురు పిల్లల్ని తనకూడా తీసుకుపోయాడు. అంతేనా ? మా అయ్యనికూడా కొట్టేడు. మా అయ్య మొగవాళ్ళ వాడ్డలో ఉన్నాడు ఆయనకి దెబ్బలు తగిలేయి. నన్ను కన్నందుకు ఇదే నేనిస్తున్న ప్రతిఫలం" బోరున వడ్చింది ఆ స్త్రీ.

"వూరుకో అమ్మా, వూరుకో. నే వెడుతున్నాను. కాస్త కనిపెట్టి చూస్తుండు" మోహన్ మరీ, మరీ చెప్పి వెళ్ళేడు.

"అలాగే బాబూ, భాగ్యమా బంగారమా ?" అంటూ ఆ స్త్రీ కళ్ళు ఒత్తుకుంది.

మోహన్ వెళ్ళిపోయేడు.

---

# 8

"కౌసల్యా శాస్త్ర లేలుకుంది. జ్వరం పూర్తిగా వస్తూనే ఉంది.

"ఏమినా? డాక్టరేమన్నాడు?" అప్పుడే వచ్చిన మోహన్ ప్రశ్నించేడు.

"ఏమో బాబూ ఏమీ చెప్పలేదు. జ్వరం చూసేరు, ఎన్నాళ్ళబట్టీ అని అడిగేరు. చెప్పేను. అంతే ఆ పుస్తకంలో ఏదో వ్రాసి నర్సుకి ఏదో చెప్పి వెళ్ళిపోయాడు."

కౌసల్య అతి ప్రయాసతో జరిగిన విషయం చెప్పింది.

"అయితే డాక్టర్ని అడుగుతాలే" అంటూ మోహన్ డాక్టరు గదివైపు వెళ్ళేడు.

"సిస్టర్, డాక్టర్‌గారున్నారా?" అన్నాడు మోహన్.

"లేరండీ. ప్రొద్దుటి పూటే ఉంటారు పదిగంటలనుండి ఒంటి గంటవరకు. దేనికి?" అన్నది సిస్టర్ ఏదో రిజిస్టర్లో వ్రాసుకుంటూ.

"ఏమీలేదు మా వదినకు జబ్బేమిటో తెలుసుకుందామని. ఆ జ్వరం ఎన్నాళ్ళకి తగ్గుతుందో అడుగుదామనుకున్నాను"

"మీ వదినగారి పేరు? బెడ్ నెంబరెంత? సిస్టర్ ప్రశ్నించింది.

"ఆవిడ పేరు కౌసల్య. బెడ్ నెంబర్ ఇరవైనాలుగు".

"ఓ! ఆవిడా? తెల్లగా సన్నగా. పొడుగ్గా ఉన్నదే .. గర్భిణీ స్త్రీ ఏనా" అంటూ మోహన్ వంక చూచి టేబిల్ మీది పుస్తకం తిరగేసి చూచింది.

"ఆవిడకి టైఫాయిడ్-"

"ఎన్నాళ్ళు ఉంటుంది." మోహన్ ఆత్రంగా అడిగేడు

"అప్పుడే చెప్పటం కష్టం మిష్టర్. వ్యాధి లక్షణాలు పూర్తిగా తెలియందే ఏమాటా చెప్పలేను".

"థాంక్స్" అంటూ మోహన్ వెను తిరిగివచ్చి

"ఏదినా యేమైనా పండ్లూ, ఫలాలు తెచ్చివ్వనా"

"దేనికి బాబూ, హాస్పిటల్ వాళ్ళు యిస్తున్నారు" చిరునవ్వు నవ్వింది.

"వెళ్ళిరానా?"

"ఊఁ..."

మోహన్ వెళ్ళిపోయేడు.

మరునాడు మోహన్ ఆసుపత్రికివచ్చి నేరుగా సిస్టర్ వద్దకెళ్ళి "డాక్టరుగారున్నారా?" అని ప్రశ్నించాడు.

సిస్టర్ ఏదో వ్రాసుకుంటున్నది. "లేరు. దేనికి" అడిగింది మల్లమ్మ సిస్టర్. ముఖాన ఉన్న ఎర్రని తిలకం

నిర్మలమైన ఆకాశంలో పశ్చిమాద్రిన ప్రకాశించే సూర్య బింబంలా ఉంది.

నిన్న వచ్చినప్పుడూ ఇదే సమాధానం చెప్పారు గుర్తుందా?" మోహన్ నవ్వేడు.

"నిన్న మీరూ ఇదే ప్రశ్న వేశారు గుర్తుందా?" చిలిపిగా మాటకిమాట అందించింది మల్లమ్మ.

"మీ పేరేమిటో అడగవచ్చునా?"

"పేరుతో పనేమిటో-" ఓరగాచూస్తూ ప్రశ్నించింది.

"మాట . . . అందించే మగువ ఎవరా అని" మోహన్ కిలకిల నవ్వేడు.

"మల్లమ్మ"

"ప్చ్, ఏం పేరు అది?"

"ఏం బాగా లేదా?"

"అందానికి తగ్గ పేరుండవద్దూ?"

"అయితే ఏ పేరు బాగుంటుందంటారు?"

"ఇప్పుడు తెలుసుకొని ఏమిటి లాభం-"

"ఏం? ఎందుకుండదూ? అయినా చెప్పండి చూద్దాం."

"ఇలా మాట్లాడితే మీ సిస్టర్ ఏమీ అనదా?"

"అంటే-" అర్థం కానట్లు చూచింది మల్లమ్మ.

"అదే స్టాఫనర్సా, హెడ్ నర్సా?"

"హెడ్‌నర్స్"

"సమాధానం చెప్పరేం?"

"ఏమిటి మీ రడిగిన ప్రశ్న."

"ఇంత పరధ్యానంతో మీరు రోగుల్నెంపరీక్షిస్తారు? మందులు సరిగానే యిస్తున్నారా, లేక ఒకరి కివ్వవలసింది మరొకరి కిస్తారా" మోహన్ పకపక నవ్వాడు.

"మీ బోటి వాళ్ళు ఎదురుగా ఉంటే జరిగేదంతే" కిలకిల నవ్వింది మల్లమ్మ.

మోహన్ కిందకివంగి ఏదో వెతుకుతున్నట్లు చూచేడు.

మల్లమ్మ అర్థం కాక తెల్లబోయింది.

"ఏమిటండీ - ఏమిటో వెతుకుతున్నారే! ఏం పారేసుకున్నారు?"

"ముత్యాలేమైనా రాలేయేమోనని."

"అబ్బో-చాలా గడసరులే. ఏమో ననుకున్నాను. ఇంతకీ వచ్చిన పని వదిలిపెట్టి ఇలాగేనా ప్రవర్తించటం-"

"ఏం చెయ్యను? మనుషుల మతులు పోగొట్టే మల్లమ్మలు ఎదురైతే జరిగే పనులు ఇలాగే వుంటాయి."

"మణి ఎవరికండోయ్ పోతా—" సన్నగా, రివటలా ఉన్న మరో సిస్టర్ వచ్చింది.

"నాకేనండీ."

"ఏం? వ్యవహారం అంతదాకా వచ్చిందా?" గలగల నవ్వేసింది.

"కాసిని మంచినీళ్ళు ముంచుకోనా?" మోహన్ అడిగేడు.

"ఎక్కడ?" వెల్లబోయింది అప్పుడే వచ్చిన సిస్టర్.

"మీా సెలయేరులో."

"అదేమిటే—" అర్థం కాక మల్లమ్మ వంక చూచింది.

"నీవు నవ్వుతుంటే సెలయేరు ప్రవహించినట్లు అనిపించిందట. అందుకని మంచినీళ్ళు ముంచుకోనా అని అడుగుతున్నారు."

"అదా సంగతి. నాకూ కవిత్వాలొస్తె తెలిస్తు" స్వచ్ఛంగా మల్లెపూవు విచ్చినట్లు నవ్వేసింది సుందరి.

"ఏమిటా నవ్వులు ఆ డయట్ లెక్టర్ వ్రాసేరా? అందరికి ఇంజక్షన్లు యిచ్చేరా?" అంటూ హెడ్‌నర్సు వచ్చింది అక్కడికి.

అంతటితో సంభాషణకి బ్రేకు పడింది.

"మీాకేం కావాలి మిష్టర్— ఇలాంటి సమయంలో మీారిక్కడ ఉండకూడదు. ఇది స్త్రీల వార్డు. అందులో విజిటర్స్ వచ్చేవేళ ఇది కాదు. వెళ్ళిపోండి" అంటూ మందలించింది హెడ్‌నర్స్.

మోహన్ మారుమాట లేకుండా తిన్నగా వదిన దగ్గరికి వచ్చేడు.

"వదినా? వెళ్ళిరానా?"

"వెళ్ళు బాబూ. ఇంత ఆలస్యం అయిందేం ?"

"సిస్టర్‌ని అడిగేను ఆవిడకి తెలీదట—" అబద్ధము ఆడాడు మోహన్.

"సరే వెళ్ళుబాబూ. రోజూ రావటం దేనికీ, కాళ్ళ త్రిప్పట ! డబ్బు దండగ, పైగా మాధవి నొచ్చుకుంటుంది. ఆవిడనేమీ అనకు. మీరిద్దరు అన్యోన్యంగా ఉండటమే నాకు కావలసింది బాబూ. నేను దురదృష్టవంతురాల్ని. ఆయన్ని మింగేశాను."

"ఏడవకు పదినా నీవు చేసిన దేమీలేదు భగవంతుడు చేసినదానికి నిన్ను నిందించుకుంటావేం ? వెళ్ళిరానా ?"

"ఊఁ"

"ధైర్యంగా ఉండు" అంటూ మోహన్ నిష్క్రమించేడు.

---

# 9

" మాధవీ."

"ఏం ?"

"ఇలారా ఓసారి—" మోహన్ పిలిచేడు.

"దేనికీ, పనిలో ఉన్నాను" మాధవి కటువుగా జవాబు చెప్పింది.

"ఏమయ్యా ! ఆవిడ కెలాఉంది" సుమిత్ర అడిగింది అటువస్తూ.

"కులాసాగా ఉంది. కానీ బాగా నీరస పడిపోయింది. ఆపరేషన్ చేస్తారట. ఎవరినైనా ఉంచమన్నారు" మోహన్ గొంతు ఆందోళనని వ్యక్తం చేస్తున్నది.

"అలాగా, ఎవరుంటారు ? ఎవరి సంసార భాధ్యతలు వారివి" సుమిత్ర పెదవి విరిచింది.

"మాధవిని ఉంచుదామను కుంటున్నాను" మోహన్ గంభీరంగా అన్నాడు.

"ఆ ? మాధవి అందుకు అంగీకరిస్తుందా ?" సుమిత్ర కనుబొమలు ముడిపడ్డాయి.

"ఏమో మరి."

"నాకు నమ్మకంలేదు. అయినా పిలుస్తా ఉండు. మాధవీ" బిగ్గరగా కేక వేసింది.

మాధవి బైటికొచ్చింది.

"ఏమిటక్కా?" చేతిలో టేబిల్ క్లాత్‌తో అలాగే వచ్చింది.

"కౌసల్యకి ఆపరేషన్ చేస్తారట, నీవు వెడతావా?"

"ఉహూ-నీవు వెడతావా?" సుమిత్ర కళ్ళల్లోకి ప్రశ్నార్థకంగా చూచింది.

"ఉహూ-ఈ పిల్లా, పుకాతోటి నా కెక్కడ వీలవుతుంది?" సుమిత్ర కట్టె విరిచినట్లు చెప్పేసింది.

"ఏమిట్రా ఏదో మాట్లాడుతున్నారే" సావిత్రి అక్కడికి చేరింది.

"కౌసల్యకి ఆపరేషన్ చేస్తారట" సుమిత్ర కక్కేసింది అసలు నిజాన్ని.

"అయ్యో పాపం. అలాగా" సావిత్రి కళ్ళల్లో సానుభూతి ప్రతి ఫలించింది.

"ఎవరైనా అక్కడ ఉండాలంటున్నారట" మాధవి అందుకున్నది.

"మరెవరు పోతున్నారు?"

"ఎవరికి తీరుతుంది? ఎవరిబాధ వాళ్ళది."

"పోనీ నేను వెడతాను" సావిత్రి ప్రస్ఫుటంగా పలికింది.

సుమిత్ర దిగ్భ్రమపోయింది.

మాధవి మారుమాట పలకలేదు.

"నీకేంపట్టింది? మధ్య నీకెందుకాశ్రమ" సుమిత్ర ఉండబట్టలేక పోయింది.

"రేపు మనకేదైనా నస్తే ఎవరైనా సాయం చెయ్యొద్దూ? ఈ శరీరం శాశ్వతమా? ఎప్పుడేది వస్తుందో" సావిత్రి బాధగా నవ్వింది.

"అవ నిజమనుకో. అయినా రేపు నీకు ఆవిడ చెయ్యబోతున్నదా?" సుమిత్ర ఎలాగైనా సావిత్రిని ఆపాలని ఆఖరి అస్త్రం విసిరింది.

"ఆవిడే చెయ్యాలన్న నియమం లేదు. దేనికైనా పెట్టి పుట్టాలిగా. మనం ఒకరికి చేస్తే మనకు భగవంతుడు మరొకర్ని చూపిస్తాడు."

"అవును, నాకు పని ఉంది. తర్వాత మాట్లాడదాం" సుమిత్ర మెల్లగా జారుకుంది.

"మాధవి మౌనముగా వెళ్ళిపోయింది."

"బాబూ" సావిత్రి పిలుపుతో పడక కుర్చీలో మేను వాల్చి ఆలోచనలతో మునిగి తేలుతున్న మోహన్ ఉలిక్కిపడ్డాడు.

"దేనికి వదినా!"

"ఎప్పుడు ఆపరేషన్ చేస్తారట!"

"రేపు."

"అలాగా, అయితే ఇవేళ సాయంత్రం నన్ను నీతో కూడా తీసుకెళ్లు బాబూ."

"అలాగే వదినా" గంజాయి మొక్కల్లో తులసి మొక్కలూ, గాజు పెంకుల్లో, వెలగలరత్నాలు, మసి బొగ్గుల్లో, మాణిక్యాలూ ఉంటాయన్న ఊహ మోహానికి అప్పుడే తట్టింది.

"ఈ రాక్షసుల్లో ఎలా బ్రతుకుతున్నావు వదినా" నిట్టూర్చాడు మోహన్.

"రాక్షసత్వం అజ్ఞానంవల్ల, అహంకారంవల్ల వస్తుంది బాబూ, ఈ మట్టి శరీరాలే శాశ్వతమని భ్రమిస్తారు. మరు క్షణంలో జరగబోయేది ఎవరికి తెలుసు బాబూ." సావిత్రి నవ్వింది.

"ఆ విషయం అందరికీ తెలుసు. అయినా అడుగడుగునా మానవుడు మరిచి పోతుంటాడు. కాబట్టే ఇన్ని అకృత్యాలు, ఇన్నిఘోరాలు ఇన్ని హత్యలూ జరుగుతుంటాయి. మాయ మానవుడిని అడుగడుగునా మరులు కొల్పుతుంది. తన జాలములో చిక్కించుకుంటుంది."

మోహన్ బరువు దిగినట్లు స్వేచ్ఛగా ఊపిరి పీల్చాడు.

"నీవు దేవుడిలా ఆపదలో అడ్డు కుంటున్నావు వదినా. జన్మజన్మాలకి నీ ఋణం తీర్చలేదు చిన్న వదిన. ఎలా చెయ్యటమా అని మథనపడి పోతున్నాను" మోహన్ మనస్సు సంతోషంతో గంతులు వేసింది.

"ఇదో పెద్ద గొప్ప బాబూ. మనం మానవులం. ఎప్పుడేది వస్తుందో తెలీదు. ఒకరి ఆపదల్లో మరొకరు సాయ పడటం అది మానవత్వం అనిపించుకుంటుంది. అంతే" సావిత్రి తేల్చేసింది.

"నీలాంటి వాళ్ళకి అలాగే అనిపిస్తుంది."

"సాయంత్రం మరిచిపోకు బాబూ."

"అలాగే వది గా"

సావిత్రి వెళ్ళిపోయింది.

మోహన్ ఈల వేసుకుంటూ బైటకి వెళ్ళిపోయాడు.

---



# 10

"రేపు ప్రొద్దున ఏమీ తినిపించకు. నొప్పులు ఆరంభం కాగానే మాకు చెప్పు" అంటూ సిస్టర్ సావిత్రిని హెచ్చరించి వెళ్ళింది.

ఆరాత్రంతా సావిత్రికి నిద్రపట్టలేదు. లైట్లు వేస్తున్నారు. తీస్తున్నారు.

"నన్ను పోనియ్యండల్లో. నా బిడ్డ ఎట్టాగుందో నా కొడుకెట్టా ఉండాడో" క్రొత్తగా వచ్చిన పేషెంటు గోల పెడుతోంది.

సావిత్రి లేచి కూర్చుంది.

"ఏమైందిట" ప్రక్కన నిలబడ్డ దాయీని ప్రశ్నించింది.

"తల పగిలిందిట."

"ఆ"

"అవును"

"ఎలా పగిలిందో-"

"రిక్షా టక్కరిచ్చాడట"

"రిక్షా టక్కరికే తల పగిలిందా?"

"ఒకవైపున రిక్షా మరో వైపు లారీ వచ్చేయట. మధ్యలో ఇది చిక్కుకుంది."

"అదృష్టవంతురాలే. బ్రతుకుతుందా?"

"బ్రతకవచ్చు."

"అరే, నన్ను ఇడవమంటుంటే" ప్రక్కమీద పడుకో పెట్ట బోయిన దాయీని చెయ్యి విదిలించింది.

ఆ దాయి "అబ్బా" అంటూ చెయ్యి పట్టుకుంది.

"నీకేం పొయ్యేకాలం వచ్చిందే ముండా. నా చెయ్యి ఇరిచేశావు గదే సచ్చినదానా" దాయీ శాపనార్థాలు పెడుతోంది.

"పట్టుకోండ్రరా" సిస్టరే నిద్రమత్తులో కోపంగా అరిచింది.

"అది తోసేస్తుంటే ఎట్టా పట్టుకోమంటా వమ్మా" దాయీ మండిపడింది.

"మరి పట్టుకోలేక పోతే ఏమిటి చేస్తావు? ఓ గౌరమ్మా. నీవు కూడా ఇలారా" సావిత్రితో కబుర్లు చెప్తున్న గౌరమ్మని కేకేసింది సిస్టర్ విసుగ్గా.

"ఏందమ్మా"

"మీరిద్దరూ పట్టుకొని దాన్ని మంచంమీద పడుకో బెట్టండి" సిస్టర్ ఆజ్ఞాపించింది.

గౌరమ్మ ముందుకి పోయింది.

"ఒసే, నీవా రెక్క పట్టుకోయే, నేను ఈ రెక్కం కుంటా" చెయ్యి నొప్పి పుట్టున్న దాయీ అన్నది.

"సరే లేవే సెల్లమ్మా, పట్టుగో గట్టిగా కూలేయి" గౌరమ్మ ఓ రెక్క అంది పుచ్చుకుంది.

"ఏములాళ్ళలాగా ఏందే మీ-రంతా నా ఎంట పడ్డారు? ఇడవండెహె" అంటూ ఒక్కసారి విదిలించింది.

గౌరమ్మది అసలే స్థూలదేహం. పేడ కుప్పలా వెళ్ళి అవతల మంచానికి కరుచుకుంది. "ఓలమ్మో సస్తినే" అంటూ.

"అయిందా మాబాగా కుదిరిందా రోగం" నవ్వింది ముత్తమ్మ.

"ఏఁటర్రా మీగోల ఉండండి" అంటూ సిస్టర్ గ్లూకోజు ఇంజక్షన్ తీసుకొచ్చింది.

"నీవుకూడ కూస్త రుచి సూడమ్మా, తెలుసుద్ది" పకపక లాడింది ముత్తమ్మ.

"పట్టుకోమంటే నవ్వుతారేం?" సిస్టర్ విసుక్కుంది.

"మా సేత కాలేదమ్మా" అప్పుడే ఒళ్ళు సవరించుకుంటున్న గౌరమ్మ మెల్లగా అంది.

"అంతేనా పస! విగ్రహపుష్టి నైవేద్య నష్టి."

మేల్ దాయీలు గలగల నవ్వేరు. "ఏందే గౌరీ, ఇంతేనా నీబలం" అంటూ.

"మరే, పాపం మొగోళ్లు వచ్చేరు. రండి సూద్దురు గాని."

"ఈరయ్యా నీవో చెయ్యిపట్టుకో. రోశయ్యా నీవో చెయ్యి పట్టుకో" అంటూ సిస్టర్ సూదిమందు ఎక్కించబోయింది.

ఈరయ్యా, రోశయ్యా ముందుకి వచ్చేరు. "ఇదో లెక్కా మాకు" అన్నంత ధీమా చూపేరు.

"ఎవుడ్రా అదు చెయ్యి తియ్యి, నాకోపం వచ్చిందంటే దవడ పగులద్ది" ఒక్కవిసురు విసిరింది. అంతే. ఈరయ్య ఈ వైపూ, రోశయ్య ఆ వైపూ ఉన్న గోడలికి ఢీ కొట్టారు.

ముత్తమ్మ, గౌరమ్మ గొల్లుమన్నారు. ఈ తమాషా చూడటానికి పేషెంట్లంతా లేచారు. నడవ గలిగిన వారంతా గుమిగూడేరు.

"గెటవుట్. డేనికర్రా అలా మూగేరు పదండి" సిస్టర్ హుంకరించింది.

"ఇదుగో, ఇలా చేశారంటే పోలీసుల్ని పిలిపిస్తాను. తిన్నగా ఉండి ఇంజక్షను తీసుకో" సిస్టర్ బెదిరించబోయింది.

"ఎవడో పోలీసోడు రమ్మను. ఆడి అంతు కనుక్కుంటా" పకపక నవ్వింది ఆ పేషెంటు.

సిస్టర్ ముఖం పాలిపోయింది. ఓటమిని ఎలా అంగీకరించటం?

అదీ యింత పబ్లిగ్గానా?

ప్చ!!

మరోసారి ఇంజక్షన్ యివ్వటానికి ప్రయత్నించబోయింది. చెయ్యి ఒక్కసారి మెలిబెట్టింది ఆ పేషెంటు.

"బాబో, చస్తినో" అంటూ ముని పంట పెదవులు కొరుకుతూ అవతలికి నడిచింది సిస్టర్.

అందరూ ఒక్కసారి గొల్లున నవ్వేరు.

అత్తమీదికోపం దుత్తమీద చూపినట్లుగా సిస్టర్ చుట్టూ చేరిన పేషెంట్లమీదికి విరుచుకు పడింది.

"వెళ్ళండి అంతా, దేనికిక్కడా? ఇదేం తమాషాయా? గారడీయా?" అంటూ కసిరి కొట్టింది.

అంతే! అందరూ ఎవరి బెడ్ మీదికి వారు చేరారు.

సావిత్రి కౌసల్య మంచం దగ్గరే నిలబడింది.

"అందరూ పడుకోండి" అంటూ ఆర్డర్ జారీచేసి వెళ్ళిపోయింది సిస్టర్ అవమాన భారంతో సగం చచ్చి.

తెల్లవారబోతూ ఉంది. హాస్పిటల్ దగ్గర చెట్లమీద కాకులు రొదచేస్తున్నాయి. మసక చీకటిగా ఉంది!

అప్పటికే ఆపరేషన్‌కి పేషెంట్లని సిద్ధం చేస్తున్నారు.

కౌసల్యదే మొదటి కేసు. ఆపరేషన్ ఎలా అవుతుందో?

కౌసల్య గుండెలు టకటక కొట్టుకున్నాయి.

ఒకప్రక్క మరణించాలనీ వుంది. మరోప్రక్క జీవించాలనీ ఉన్నది.

పోనీ-ప్రాణంపోతే ఈ బాధలు తప్పుతాయి!

ఎందుకు చావాలి? తన బిడ్డకోసం బ్రతకవద్దూ! ఒకవేళ తన బిడ్డ బ్రతికి తను చనిపోతే ఎవరు సాకుతారు?

అమ్మో! ఎవరు సాకుతారు? ఎవరి కే మవసరం? మాధవి సాకుతుందా? ఊహూ! అసలే అనుమానపు మనిషి!

ఎవరేమిచెప్తే అలా నమ్ముతుందే! అలాంటి పూర్తి సాకుతుందా?

పోనీ, సావిత్రి? ఏమో! సుమిత్ర పనిస్తుందా? అమ్మ పెట్టాపెట్టదు అడుక్కు తిననీయదు. సుమిత్ర తను ఒకరికి సాయంచెయ్యనూలేదు. ఒకరుచేస్తే చూస్తూ ఊరుకోనూ లేదు!

ఎలా మరి? తను బ్రతకదేమో! ఎందుకు బ్రతకదూ? పాపీచిరాయువూ అని చెట్టంత భర్తను మ్రింగి యింత వరకూ బ్రతకలేదూ? కాలంవస్తే అందరూ చనిపోతారు! అంతవరకూ బ్రతక్క తప్పదుగా? తనకింకా యీ భూమి మీంద గింజలున్నాయేమో!

కౌసల్య మనస్సు పరిపరి విధాల పోతున్నది! గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి! ఆ శబ్దం తనకే స్పష్టముగా వినిపిస్తున్నది!

రెండు జడలు వేశారు! వెనక్కి కట్టారు! కాళ్ళకి మేజోళ్ళలాంటి బట్టలు తొడిగేరు! ఒంటిన తెల్లటి బట్టలు చుట్టేరు! శవానికిచేసే సంస్కారంలా అనిపించింది కౌసల్యకి.

"అక్కా, నేను బ్రతక్కపోతే, పుట్టే పాపని చూస్తారు కదూ?" కౌసల్య కంఠం వణికింది!

"ఛా! అవేం మాటలు? ఎందుకు బ్రతకవు? రోజు కెంతమందికి ఆపరేషన్ చెయ్యటంలేదూ?" అంటూ ధైర్యం చెప్పబోయింది సావిత్రి. కానీ మనస్సులో ఏదో కలికినట్లు, బరువు పెట్టినట్లుగా ఉంది!

కౌసల్యని ట్రాలీమీద పడుకోబెట్టి ఇద్దరు దాయీలు నెట్టుకుపోయినారు. కూడా సావిత్రి నడుస్తోంది !

"లోపలికి రావద్దు! ఇక్కడ్నే ఉండు" అంటూ సావిత్రిని గుమ్మంలోనే ఆపేశారు.

కౌసల్య కండ్లకు గంతలు కట్టేరు ! మత్తు ఇంజక్షను ఇచ్చేరు. కౌసల్యకి మత్తుగా ఉంది ! కళ్ళు మూతలు పడి పోయాయి !

ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకుపోయారు ! ఏవో పాదాల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి ! ఎక్కడో కోస్తున్నట్లు కత్తిరిస్తున్నట్లు శబ్దాలు వినిపిస్తున్నాయి ! అవి కలో, నిజమో తెలియలేదు ! చేతికేదో సూది గ్రుచ్చినట్లున్నాయి !

ఇంతలో కెవ్వుమన్న కేక ! పసిపిల్లదో, పిల్లవాడిదో అయిఉండాలి ! కౌసల్యకి అంతా కలలాగా అనిపించింది !

అంతే ఆపరేషన్ అయిపోయిందన్నమాట ! నాడి బైటపడింది !

ఇంక తనేఉంది! కుట్లేస్తారు కాబోలు! ఎలా ఉంటుందో! అబ్బ ! చూడటానికి అసహ్యం వెయ్యదూ ? గోడని కోసి నట్లు ఎలా కొయ్యగల్గుతారో ? వాళ్ళకి భయంవెయ్యదో!

కుట్లువెయ్యటం అయిపోయిందికాబోలు ! ఆపరేషన్ టేబిల్ మీద ట్రాలీమీదికి మార్చేరు ! కౌసల్యకంతా లీలగా తెలుస్తున్నది ! తీసుకొచ్చి బెడ్ మీద పడుకోబెట్టారు ! గ్లూకోజ్ నీళ్ళు ఎక్కిస్తున్నారు !

కౌసల్య కళ్లు ?చింది!

కౌసల్య ప్రక్కలో బాబు! చిన్న చొక్కా తొడుక్కొని కళ్లు మూస్తూ తెరుస్తూ బుల్లి బుల్లి పాదాలతో తంతూ ఉన్నాడు!

కౌసల్య కనులనిండా కరుణ, ప్రేమ తొణికిసలాడింది! సావిత్రి బాబుని చేతుల్లోకి తీసుకొని ఒంటికి ఆనందం పట్టించి సిస్టర్‌ని అడిగి గ్లూకోజ్ నీళ్ళు తెచ్చి చెంచాతో గొంతు తడిపింది. పిల్లవాడు కళ్ళుమూసుకొని కౌసల్య ప్రక్కన కనకపు సింహాసనంమీద అధిష్టించిన మహారాజులాగా నిశ్చింతగా నిద్రపోతున్నాడు! కౌసల్యకి మత్తు పూర్తిగా వదిలింది! గ్లూకోజు ఎక్కించటం ఆపేశారు.

కౌసల్యని ప్రక్కకిత్రిప్పి వడుకోబెట్టింది దాయి! కుట్లు చురుక్కుమంటూ - సూదులు పొడిచినట్లు బాధ పెడుతున్నాయి! కానీ చేసేదేమున్నది?

ఎవరికి యే జన్మలో బాధ కలిగించానో అంటూ కౌసల్య బాధపడింది! మరిచిపోవటానికిగాను భగవంతుడు నసకో ఫలాన్ని ప్రసాదించాడు!

కౌసల్య నిండుగా నవ్వుతుంది! నేటికి కౌసల్య పెదవులపై దరహాసం తిరిగి నాట్యం చేసింది! సావిత్రి మనస్సు తేలిక పడింది!

మోహన్ అప్పుడే ఫ్లాస్కు, డబల్ రొట్టెతో ప్రత్యక్షమైనాడు!

"వదినా" అంటూ దగ్గరకొచ్చేడు!

కౌసల్య చిరునవ్వు నవ్వింది.

"బాబుఏడీ?" అన్నాడు మోహన్.

"ఇదుగో మోహన్. బాబూ బాబాయివచ్చాడు చూడవోయ్" అన్నది సావిత్రి పిల్లవాడ్ని అందిస్తూ!

"అంతా అన్నయ్య పోలికే వదినా" అన్నాడు మోహన్ ముద్దుపెట్టుకుంటూ.

కౌసల్య గుండెలమీద బరువుదింపి నట్లయింది!

కౌసల్య కులాసాగా కబుర్లుచెప్పేదే కాని అవిటితనం ఒకటి అంటిపెట్టుకొని ఉన్నది.

ఆ విషయం మరిచేపోయాను!

సావిత్రి కౌసల్యతో "ఇటు తిరుగు కౌసల్యా! మరిది వచ్చాడు" అన్నది.

"తిరగలేనక్కా!" అన్నది కౌసల్య మ్లానవదనంతో. పెదవులపైని దరహాస చంద్రికలు మబ్బుతెరల వెనక దాక్కున్నాయి!

"ఏమైందమ్మా?" సావిత్రి అడిగింది!

"అది నా దురదృష్టం అక్కా! ఈ పుట్ల బాధ లొకటి! రెండోది నా కాళ్ళు నా స్వాధీనంలో లేవు" పొడిగా నవ్వింది కౌసల్య!

"ఆ? కాళ్లు స్వాధీనంలో లేవూ? అదెప్పటినుంచి?" సావిత్రి ఆశ్చర్యంతో అడిగింది.

"చాల రోజులనుంచి. జ్వరంలో నా కాళ్ళూ, నడుమూ స్వాధీనంతప్పాయి అందుకే ఈ ఆపరేషన్" నిట్టూర్చింది కౌసల్య !

"ఆ విషయం నాకింకా తెలీదు చెల్లీ. ఎంత దుర దృష్టవంతురాలివి ?" నిట్టూర్చింది సావిత్రి.

"అవునక్కా ! భగవంతుడు నా నుదుట ఇలా వ్రాశాడు ! చెట్టంత మనిషి పోయారు ! కాలూ, నడుమూ స్వాధీనం తప్పాయి ! ఈ బ్రతుకెందుకో అర్థంకాదు ! ఈ పసివాణ్ణి నా కడుపున వడేసి భగవంతుడు వాడికికూడా అన్యాయంచేశాడు ! వాడూ దురదృష్టవంతుడే" పేలవంగా నవ్వింది కౌసల్య

"అలా అనకు చెల్లీ! ఎవరి భవిష్యత్తు ఎవరు చూచేరు. వాడు అదృష్టవంతుడై నీ బాధల్ని గట్టెక్కించవచ్చు. విధి విలాసం ఎలా ఉంటే అలా జరుగుతుంది" సావిత్రి ఓదార్చ ప్రయత్నించింది.

"వదినా ! నీవు అలా అనటం బాగా లేదు ! దురదృ ష్టవశాత్తూ అన్నయ్య పోయాడు ! నిజమే ! నేను కాదనను! కానీ నేనింకా బ్రతికే ఉన్నాను ! అన్నయ్య నాకు చేసినమేలు యీ జన్మలో మరచిపోను. నీ బాబును నా బాబుగా పెంచు తాను" మోహన్ జవాబిచ్చాడు.

"ఏమో బాబూ ! ఎలా పెంచు తావో" అన్నది కౌసల్య నిస్పృహతో.

"వదినా! పెద్ద వదిన నిన్ను రమ్మన్నది! పిల్లలు నానా అల్లరీ చేస్తున్నారు భరించలేను అన్నది" అన్నాడు మోహన్!

"అలాగా? అక్కా నీవు యింటికి వెళ్ళు. పిల్లల్ని చూచుకో! నా అదృష్టం ఎలా ఉంటే అలా చేస్తాను" అన్నది కౌసల్య నిట్టూర్చి.

"ఆ! వాళ్ళే ఉంటారులే! నాలుగు రోజులపాటు ఉంటాను" అన్నది సావిత్రి.

"ఊహూ! నీ విక్కడ ఉంటే నన్ను చంపుకు తిన్నట్లే! ఇంటికి వెళ్ళక్కా! నాకోసం నీవు పిల్లల్ని బాధపెట్టటం బాగాలేదు! నేను పుట్టుకతోనే దౌర్భాగ్యాన్ని వెంట తెచ్చుకున్నాను. నా నీడన ఉన్న వారికికూడా అదే అబ్బుతుంది. దయచేసి నామాట మన్నించు" కౌసల్య కళ్ళవెంట నీళ్ళు కారాయి.

"ఛీ! ఛీ! పిచ్చిపిల్లా అవేం మాటలు? నేనుంటాగా నీకెందుకు?" అన్నది సావిత్రి.

కానీ కౌసల్య అంగీకరించలేదు.

సావిత్రి వెళ్ళటానికి ఎట్టకేలకు ఒప్పుకున్నది.

అయితే చంటివాడి సంగతేమిటి? ఎవరు చూస్తారు? కౌసల్య స్వయంగా అటునుంచి యిటు పొర్లలేదు. పాలివ్వటం, బట్టలు మార్చటం ఎలా? హాస్పిటల్ దాయీలు

ఇవన్నీ చేస్తారా ? ఏదైనా ఇస్తే చేస్తారు? కానీ తనవద్ద ఏమీ లేదే !

"బాబునేం చేస్తావు బాబు" అన్నది కౌసల్య !

"నేను తీసుకుపోతాను" అన్నాడు మోహన్.

"పాలూ" అన్నది కౌసల్య సగం సిగ్గుతో.

"కొని పోస్తాను" అన్నాడు మోహన్.

"నేను చూచుకుంటాలే చెల్లీ ! త్వరగా నయం చేసుకోనిరా" అంటూ చంటివాడ్ని పొత్తి గుడ్డల్లో చుట్టి బుజాన వేసుకొని వెళ్ళిపోయింది సావిత్రి. సావిత్రి వెనక మోహన్ కూడా వెళ్ళిపోయాడు.

కౌసల్య ముఖం పాలిపోయింది ! తానెంత నిర్భాగ్యురాలు ? కన్నబిడ్డకు కడుపారా పాలిచ్చి పెంచుకోలేని కటిక దరిద్రురాలు! తన కీ అంగవైకల్యం దేనికి దాపురించినట్లు?

కాళ్ళు కదలవు. నడుము లేవదు! ఎవరైనా తనని ప్రక్కకి తిప్పాలి కాళ్లు ఒకచోటినుంచి మరో చోటికి కదల్చాలి. ఇలాంటి నికృష్ట జీవితం ఎన్నేళ్ళు గడపాలి ? దుఃఖం పొర్లి వచ్చింది! బాబు ముఖం చూడలేదు తను సరిగా !

పుట్టిన కొద్ది గంటలకే తల్లినుండి వేరు చేయబడ్డాడు. ఎంత దౌర్భాగ్యుడు ?

తానెంత పాపి? ఎంతమంది తల్లీ బిడ్డల్ని వేరు చేసిందో. తన కిలాంటి అవస్థ వాటిల్లింది. కౌసల్యకి వేరే నరకం లేదనిపించింది ! ఈ జీవితంలోనే నరకాన్ని కళ్ళారా.

అనుభవిస్తోంది. రంపపు కోతలను భరిస్తోంది! అవమానాన్ని భరిస్తోంది! భూమి ఎందుకు విచ్చుకోదో? తనని ఎందుకు తన కడుపులో చేర్చుకోదో? మృత్యువు తనని ఎందుకు దరి చేరదో? మృత్యువుకి కూడ తనపైన నిర్దయే!

కౌసల్యకి క్షణమొక యుగంగా గడుస్తోంది.

"కౌసల్యా? కులాసా?" అంటూ సిస్టర్ వచ్చి పలకరించింది.

కౌసల్య తల త్రిప్పింది.

"ఆపరేషన్ అయిందటగా."

"అవును."

"బాబు ఏడి..." అనుమానముగా అడిగింది సిస్టర్.

"యింటికి తీసుకపోయింది మా తోటికోడలు."

"దేనికీ?" సిస్టర్ అర్థం కాక తెల్లబోయింది.

పెంచటానికి. నాకు కాళ్ళు, నడుము స్వాధీనంలో లేవుగా."

"ప్చ! అలాగా" సిస్టర్ జాలిపడింది.

"ఆవిడే యిక్కడ ఎందుకు ఉండకూడదూ?"

"ఆవిడ సంసారాన్ని వదిలి ఎలా ఉంటుంది యిక్కడ? అయినా ఒకరోజా, ఒక నెలా! ఎలాగో బాధపడటానికి? ఎన్నాళ్ళిక్కడ ఉండాలో" కౌసల్య నిస్పృహతో జవాబిచ్చింది

"అవును డాక్టర్ అదే చెప్పారు. ఇంకా రెండు సంవత్సరాలైనా పడుతుందట" అన్నది సిస్టర్.

"అమ్మబాబోయ్ అంతవరకూ ఇక్కడుండాల్సిందే" కౌసల్య భారంగా నిట్టూర్చింది.

"ఆ! తప్పదు నీకు వెన్నుమీద ఆపరేషన్ చేసి నీరు తీస్తారట! అప్పుడు బహుశా రావచ్చు కాళ్ళుకూడా స్వాధీనంలోకి రావచ్చు అంటున్నారు" అన్నది సిస్టర్.

"అబ్బో! మళ్ళీ ఆపరేషనా?' అంది కౌసల్య చింతతో.

"అవును చెయ్యాలిట! అంతేనా? కాళ్ళు రాకపోతే కాళ్ళకూడా ఆపరేషన్ చేస్తారట."

"అమ్మబాబోయ్! అయితే నేను బ్రతికేది ఉట్టిదే. నా బాబును చూడకుండా నేనిక్కడే చచ్చిపోతాను" కౌసల్య దిగులుగా అంది.

"నీవేమీ బెంగెట్టుకోకు. మన డాక్టర్ మంచి నేర్పరి. అన్నిరోగాల్ని కుదర్చగలరు. నీవు మళ్ళీ నడిచేట్లు చేయించటం ఆయనభారం. నీవాచింత వదిలిపెట్టు. అయితే నీకొడుక్కి ఏం పేరు పెడతావు"

"ఏ పేరు పెట్టమంటారు?"

"జీసస్ అని పెట్టు."

కౌసల్య పెదవులపై నవ్వు పరచుకుంది.

"మేము క్రిష్టియన్లము కాము."

"సారీ, అయితే ఏం పేరు పెడతావు?" కౌతుకంతో అడిగింది సిస్టర్.

"ఏమిటి పేరు ?"

"మధుసూధన్"

"ప్చ !"

"చంద్రకాంత్ అని పెట్టు."

"అవును ! బాగానే ఉంది ! చంద్రుడిలా చల్లగా, అంతటి కాంతితోటే వెలిగిపోతున్నాడు నా బాబు" కౌసల్య కళ్ళు అక్కడ చూడటంలేదు.

"అయితే నీ బాబుని ఏమి చదివిస్తావు ?" సిస్టర్ కౌసల్యని ఉత్సాహపరిచే వుద్దేశ్యంతో అడిగింది

"డాక్టరు చదివిస్తాను. ఊహూం ఏమీ చదివించను" కౌసల్య నిరుత్సాహంతో తల అడ్డంగా త్రిప్పింది.

"ఏం? ఎందుకు చదివించవూ ?" సిస్టర్ ఆశ్చర్యంతో ప్రశ్నించింది !

"నాకే పూటకి గతిలేదు ! నేను వాడ్ని ఎలా పెంచనూ ? ఏమి పెట్టి చదివించనూ ? భగవంతుడు మంచి పనే చేశాడు ! నేను సవ్యంగా ఉంటే నా బాబు నాలాగే మలమలమాడిపోయ్యేవాడు! వాడు అదృష్టవంతుడు ! తల్లి దురదృష్టం వాడికి అంటకుండా భగవంతుడు చిన్నప్పటినుంచే నానుండి దూరంచేశాడు" కౌసల్య నిట్టూర్పింది.

"పోనీ అదీ ఒకందుకు మంచిదే ! నేనో ఉపాయం చెప్పనా ?" సిస్టర్ ఉత్సాహపరుస్తూ చెప్పింది.

"ఏమిటో అది ?"

"నీవు కూర్చోగలిగేంతవరకూ నేను చదువు నేర్పు తాను. రోజూ నేర్చుకో! పుస్తకాలు తెచ్చిస్తాను. చదువుకో నీకు కూర్చోవటం వచ్చాక అదుగో ఆ వాల్లెమ్మ సిస్టర్‌కి వెండి తీగెతో చీరెలమీద ఎంబ్రాయిడరీ కుట్టటం వచ్చును. నీకు నేర్పిస్తాను. బాగా కష్టపడి పనిచేస్తే రోజుకు రెండు రూపా యలపైననే సంపాదించవచ్చు. ఆ ముస్లిమ్ యువతిని చూచావా ?" అంది సిష్టర్.

కౌసల్య కళ్ళు ఆశ్చర్యంతోనూ, సంభ్రమంతోనూ విప్పారాయి.

"ఎవరా యువతి" అన్నది కౌసల్య కౌతుకంతో.

"నీబోటి నిర్భాగ్యురాలే! భర్తలేడని నీవు వాపో తున్నావు! భర్తఉండి ఆవిడ నానాపాట్లూ పడుతోంది."

"ఏం? ఎందుకూ?"

"ఎందుకేమిటి? అప్పుడు రజాకార్ల తిరుగుబాటప్పుడు పాకిస్తాన్ పారిపోయాడట! ముగ్గురు ఆడపిల్లలట! వాళ్ళని తానే సాకుతోంది."

"మళ్ళీ పెండ్లి చేసుకోలా! ముస్లిములు చేసు కుంటారే!"

"వచ్చినవాడు ఆ పిల్లల్ని సరిగా చూడవద్దూ? లేని పోని బెడద దేనికని మానుకున్నది."

"పాపం-అయితే ఎలా బ్రతుకుతోంది?" కౌసల్య ఉత్సాహంతో అడిగింది.

"ఎలాగేమిటి? వెండి తీగెతో జార్జెట్, నైలాన్, షిఫాన్ చీరెలమీద పూలు కుడుతుంది. ఇంకా కుట్టు మిషన్ కూడా ఉందిట! దానిమీదకూడా కుడుతుంది! ఎంత త్వరగా వేస్ళు కదులుతాయను కుంటున్నావు! చూడటానికి చాలా తమాషాగా ఉంటుందిలే! రోజుకి రెండు, మూడు రూపాయలకి తక్కువ కాకుండా సంపాయిస్తుంది. అంతదాకా దేనికి! నీవు స్కూలు ఫైనలు వరకూ చదువుకున్నావంటే నర్సింగ్ కోర్సులో చేరవచ్చు! వాళ్ళే స్టైఫండు ఇస్తారు. ప్యాసయితే నూట యిరవై నూట యాభై వరకు దొరుకుతాయి! ఆపైన ఇంకా పెరుగుతుంది" సిస్టర్ చెప్తూ పోతోంది.

కౌసల్య ముఖం విప్పారుతోంది. ఆశతోటీ, ఆతృత తోటీ కళ్ళు జిగేలు మంటూ మెరుస్తున్నాయి వెనకటి నిస్పృహస్థానే ఉత్సాహం, ఆకాంక్ష చోటు చేసుకున్నాయి! పెదవులపైన మందహాసం మెల్లిగా ప్రాకుతోంది.

"ఎంత అందంగా వున్నావు కౌసల్యా! నీ ముఖాన ఈ దౌర్భాగ్యం దేనికి వ్రాశాడో భగవంతుడు?" సిస్టర్ నిట్టూర్చింది.

"అయితే నాకు రోజూ చదువు చెప్తావా?" కౌసల్య ఆతృతతో అడిగేసింది.

"తప్పకుండాను! నీ ఆరోగ్యం బాగుచేసుకో! మళ్ళీ వస్తాను పని ఉన్నది" అంటూ సిస్టర్ వెళ్ళిపోయింది.

కౌసల్య మనస్సు పదేపదే సిస్టర్ చెప్పిన మాటల్ని మననం చేసుకొంటోంది.

తను త్వరగా బాగు కావాలి! కూర్చోగల్గాలి! నడవ గల్గాలి! తనూ బ్రతకగలదు! తన పాపడ్ని తానే పోషించుకో గలదు! తన బాబునీ తను ఉన్నత విద్య చదివించగలదు! ఎంత అదృష్టం? తను త్వరగా లేచి కూర్చోగల్గాలి.

అంతవరకూ సిస్టర్లు యిచ్చిపోయే రొట్టెలు దాయీ లను పంచిపెడుతూ ఉండేది. ఇచ్చిన బత్తాయిలు ఎవరో పేషెంట్లకు యిచ్చేది. ప్రక్క బెడ్ మీద తనలాగే టైఫా యిడ్ జ్వరంతో బాధపడి చివరికి కాళ్ళూ నడుమూ పడి పోయిన ఒక యువతి ఉన్నది.

ఆవిడకి భర్త ఉన్నాడు. పెండ్లయిన పదినెల్లకే యీ మాయదారి జబ్బు వచ్చింది. భార్యాభర్తల్ని వేరుచేసింది! భర్త రోజూ వస్తూ ఉంటాడు. మరదులూ, అత్తగారూ, ఆడ బిడ్డలూ, తల్లీ, తండ్రీ, అన్నలూ, తమ్ములూ, అక్కలూ, చెల్లెళ్లూ అంతా వచ్చి చూచిపోతూనే ఉంటారు.

వ్యాధితో బాధపడుతున్నానని ఆ యువతి ఎప్పుడూ చింతించదు. నల్లటి ముఖంమీద తెల్లటి దరహాస చంద్రికలు వెల్లివిరుస్తూనే ఉంటాయి. రెండు జడలు వేసుకుంటుంది. మంచిమంచి వైల్ నెట్ చోళీలు వేసుకుంటుంది. చేతుల నిండుకు గాజులు, మెడనిండా సొమ్ములు! కళ్ళకి కాటుక, నుదుట కాసంత ఎర్రటి తిలకం. పెదవులని రాగరంజితంచేస్తూ ఎప్పుడూ ఆకులు నములుతూ ఉంటుంది. చూడటానికి కళ కళ్ళాడుతూ ఉంటుంది. రోగిష్టిదని ఎవరూ అనుకోలేరు.

నడుము వచ్చింది. లేచి కూర్చోగల్గుతోంది. కొద్దిగా గోడలు పట్టి నడవ కల్గుతోంది కూడా.

ఆవిడ దగ్గర ఒక మనిషిని ఉంచారు. ఆవిడ వాళ్ళకి దూరపు బంధువు. విధవ! ఇద్దరి మధ్యా పచ్చిగడ్డివేస్తే భగు మంటుంది.

"హాసీ, రమా?" అంటూ ఆ యువతి పిలిచింది.

"దేనికీ?" టీ పెచ్చుబెడుతున్న హాసీ తిరిగి జవా బిచ్చింది.

"ఆ రొట్టె, పాలు యిలా యిచ్చిపో" అన్నది యువతి.

"దేనికి కమలా" అన్నది అవిడ తిరిగి రాకుండానే.

"చెప్పానుగా, వినిపించలేదూ'?

"ఉహూ"

"అయితే మళ్ళీ విను. ఆ రొట్టె, పాలు యిచ్చిపో"

"లేచి కూర్చుంటావుగా! నీవే తీసుకుతిను" అంటూ కేకపెట్టింది హాసి.

"బుద్ధిలేదు దీనికి. సిగ్గుమాలినదానా! ఎన్నిసార్లు పిలి చేది! ఓ రమాదేవీ, కాస్త మా పనిదాన్ని పిలూ" అన్నది కమల.

"హాసీ, మీా కమల పిలుస్తున్నది. నీవు వాళ్ళ పని మనిషివా?" అన్నది రమాదేవి.

"ఎవరన్నారూ?" హాసీ మండిపడింది!

"మీా కమల"

"దాన్ని బొందనపెట్ట. నేను దానికి పనిదాన్నా? పిన్నమ్మ నవుతాను. మహాసీ అంటుంది! డబ్బుంటే సరి! మనుషులకి అహంకారం బలిసి పోతుంది" అంటూ కేకలు వేసింది మహాసీ.

"నాకేం తెలుసమ్మా! మీా కమల మా పనిదాన్ని పిలూ అంటె అడిగేను" అన్నది రమాదేవి.

"మరి, దాని కళ్ళకి నేను పనిదాన్నిగానే కనిపిస్తున్నాను, కళ్ళు నెత్తికెక్కాయి! రోగంతో చస్తుంటే దాయీలు సైతం దగ్గరికి రాకపోతే మలమూత్రాలు ఎత్తి పోశాను. ఇప్పుడు దానికి కాని దాన్నయ్యానా? ఔరా! ఎంత పిదపకాలం! నాకది ఎంత జీతమిస్తుందో అడుగు" మహాసీ హుంకరించింది. రౌద్రరూపం దాల్చింది!

అంగలు వంగలేసుకుంటూ అరనిముషంలో అక్కడికి చేరింది.

"ఏమిటే కూస్తున్నావూ ?" హుంకరించింది మహాసీ.

"ఏమిటి కూశాను !" లోపల భయపడుతున్నా పైకి మేకపోతు గాంభీర్యం ప్రదర్శించింది!

"నేను నీకు దాసీనా? ఆవిడతో అన్నావుటగా? నాకెంత జీతం యిస్తున్నావే!"

"ఎవరన్నారామాట ? మా మహాసీని పిలవమన్నాను. అంతే!" ఆ పిల్ల తప్పించుకో బోయింది.

"నీవు కూయంది మధ్య ఆవిడకేం పట్టింది! ఏమమ్మా! రమాదేవి ఈ బడాయిమ్మది ఆ మాట అన్నదా లేదా?"

"ఆవిడ అననిదే నేనెందుకు నిన్ను అడుగుతాను?" రమాదేవి ప్రత్యుత్తరం యిచ్చింది.

"చూశారా? బద్మాష్! నిముషంలో మాట మారుస్తున్నావే" మాసీ మండి పడింది. చిలికి చిలికి గాలివాన అయ్యింది! మాసీగొంతు హాస్పటల్‌లోని ఆ వార్డంతా ప్రతి ధ్వనిస్తోంది!

ఇంతలో సిష్టర్ వచ్చింది!

"ఏమిటా కేకలు?" సిస్టర్ అరిచింది.

"ఈ పిల్లకి యింత చాకిరీ చేశానా? మీరంతా చూస్తూనే ఉన్నారుకదా! నన్ను దాసీది అంటున్నది. మీరే న్యాయం చెప్పండి నేను దాసీదాన్నా? కూటికి లేక పోయినా కులానికి పేదను కానుగా! ఆ పిల్లనాకు చుట్టం అవుతుంది. వాళ్ళ అమ్మ నా కాళ్లూ, గడ్డమూ పట్టుకొని బ్రతిమిలాడితే పోనీలే సేవచేస్తే తప్పేముందిలే అని ఒప్పు కున్నా! ఒప్పుకున్నందు కిదీ వరస. చూశారా చా తాగ టానికి బేడడబ్బులైనా యివ్వదూ! ఆకూ వక్కకి అణా పైసలైనా యివ్వక వారం రోజులైంది."

సిష్టర్‌కి యివన్నీ వినే ఓపికలేదు. "పోనిద్దూ నీవు చాకిరీచేస్తే ఎక్కడికి పోతుంది. భగవంతుడు నీకు మేలు చేస్తాడు. ఊరుకో డాక్టరు వస్తే బాగుండదు." సిష్టర్ సర్ద బోయింది.

మాసీ నోరు మూతపడలేదు. వాగుతూనేఉంది.

"ఊరుకుంటావా బైటికి గెంటించమన్నావా ?" సిస్టర్ ఉరిమింది.

ఆ కేకతో మాసీ నోరు మూతపడింది. ఆ కేకకి కౌసల్య ఉలిక్కి పడింది.

ఇంతలో "పాలు పట్టండర్రా" అంటూ డాయిటెంట సిస్టర్ వచ్చింది.

లేవకలిగిన వారంతా లేచి గ్లాసులు పట్టుతున్నారు. రొట్టె, పాలు తీసుకుంటున్నారు.

"మాసీ, పాలు పోయించుకో" అంటూ కిటికీలోని జర్మన్ సిల్వర్ గ్లాసు చూపించింది కౌసల్య.

మాసీ సంతోషంతో గ్లాసు పట్టుకుపోయి పాలు పట్టుకొచ్చింది.

"తీసుకోనా అమ్మా" ఎంతో ప్రేమతో అడిగింది మాసీ.

"ఊహు, ఆ అల్మారాపైన పెట్టు" అన్నది కౌసల్య.

మాసీ ముఖం మాడిపోయింది. సణుక్కుంటూ గ్లాసు దభీమని అల్మారాపైన పెట్టింది. దానిమీద రొట్టె పెట్టింది.

కౌసల్యకి ఉత్సాహంగా ఉన్నది. తను బాగా తిని త్వరగా లేవకల్గాలి.

పాలగ్లాసు మెల్లగా చెయ్యిచాచి అందుకొన్నది. రొట్టె తుంచి పాలల్లో ముంచుకు తిన్నది.

తృప్తిగా నిట్టూర్చింది. తియ్యటి కంఠంతో సన్నగా పాట పాడుతోంది కౌసల్య.

నడకకల్గిన పేషెంట్లంతా చుట్టూచేరారు. కౌసల్య ఆశ్చర్యపోయింది. పాట ఆపేసింది.

"బహెన్, ఏక్ గీత్ గావ్" అంటూ చేరారు.

"ఒక్కపాట పాడు, బాగున్నదని వినటానికివస్తే ఆపేశావేం?" మరో యువతి ప్రశ్నించింది.

"సిస్టర్ కోప్పడితే ఎలా ?"

"ఏమీ అనదులే" అంటూ అందరూ ధైర్యంచెప్పారు కానీ కౌసల్య మళ్ళీ పాట పాడటానికి సాహసించలేదు.

ఇంతలో డ్యూటీలోఉన్న సిస్టర్ వచ్చింది.

"ఎవరా పాట పాడేది ?" అన్నది.

అందరూ భయంతో తమ బెడ్‌లవైపు వెళ్ళారు.

"నేనే సిస్టర్, క్షమించండి. ఏమీ తోచక పాడేను"

"చాలా బాగుంది. కానీ యిది హాస్పిటల్ కదా, ఎవరైనా డాక్టరు వింటే బాగుండదు. అందువల్ల సాయంత్రపువేళల పాడుకోండి" అంటూ వెళ్ళిపోయింది.

కౌసల్య కిటికీలోనుంచి బయట కనిపించే ఆకాశంవంక చూస్తోంది, ఆకాశం ఎంత తమాషాగా ఉంది! రోజులు, నెలలు యిట్టే గడపవచ్చు. తెల్లగా, పాలనురుగులాఉన్న మేఘాలు ఒక దాన్నొకటి తరుముతూ పరుగెత్తుతుంటే చూడ ముచ్చటగా ఉంటుంది. ఇంతలో నల్లటి మేఘాలు గుంపులు

గుంపులుగా పులిని చూచిన జంతువుల్లా, తోడేలును చూచిన గొర్రెమందల్లా ఎటో అజ్ఞాత సీమలకి పరుగెడుతుంటే చూడటానికి బాగుంటుంది. చల్లటి గాలి తెరలు తెరలు వచ్చి ఆ మేఘ మాలికల్ని తరుముతూ ఉంటే కొన్ని పరుగెత్తిపోతాయి. పరుగెత్తలేని మేఘాలు నీరుకారిపోయి గజగజ వణుకుతూ జలజల కన్నీటిని ఏనుగు తొండాల్లా వర్షిస్తుంటే, వర్షం సన్నగా తుప్పరగా ప్రారంభమై చివరికి బ్రహ్మాండం బ్రద్దలైనట్లు ఆకాశం చిల్లులు పడినట్లు వర్షం కుమ్మరిస్తుంటే ఆకాశం నిండా చీకటులు క్రమ్ముకుంటే పగలో రాత్రో తెలియని వెలుతుర్లో పట్టపగలు విద్యుద్దీపాలు వెలుగుతుంటే, చల్లటిగాలి రివ్వుమనివచ్చి కిటికీల తలుపులను టకటక లాడిస్తోంది. కౌసల్య ఒళ్ళు జలదరించింది. చల్లగాలికి మనసు ప్రశాంతముగా ఉంది.

# 11

సిస్టర్ సాయంతో చదువు ప్రారంభించింది కౌసల్య.

"కౌసల్యా నీవు చెప్పిన విషయం చప్పున గ్రహించే స్తావ్. నీ బుద్ధి చాల నిశితమైంది. నీవు త్వరలోనే పాఠాలు చదవగలవు" సిస్టర్ సంతోషంతో కౌసల్య ముఖంలోకి చూచింది.

కౌసల్య కళ్ళల్లో కాంతిరేఖలు; పెదవులపై దరహాస రేఖలు, వెల్లివిరిశాయ్. కౌసల్యలేచి కూర్చున్నది బెడ్ మీద.

"అరే, లేవగల్గుతున్నావే" అన్నది సిస్టర్ ఆశ్చర్యంతో.

"అవును, మీ దయవల్ల లేవగల్గుతున్నాను. నాకు ఏదైనా పని నేర్పించండి సిస్టర్" అన్నది కౌసల్య ప్రార్థనా పూర్వకంగా.

"తప్పకుండాను. నేర్చుకోవాలేకాని ఎన్ని పనులు లేవు? పూసలతో పర్సులు, ప్లాస్టిక్ వైరుతో పర్సులు, బుట్టలు, సంచులు ఎన్నో రకాలు అల్లుతున్నారు. చాల సులభం. నీవు చూస్తే యిట్టే నేర్చుకోగలవు. సాయంత్రం మల్లమ్మ సిస్టర్‌ని పంపుతాను." అన్నది సిస్టర్.

కౌసల్య చేతులు ముకుళించి నమస్కారం చెప్పింది.

ఆరోజు పాఠం అయిపోయింది. కౌసల్య పుస్తకం చేత పట్టి ఆరోజు చెప్పిన పాఠం వల్లె వేస్తోంది.

ఇంతలో సాయంత్రమైంది.

మల్లమ్మ మెల్లగా వచ్చింది. ప్రక్కనే దాయీ చేతిలో ప్లాస్టిక్ వైరు పూసలడబ్బా, సెంకి, తీగెలు, నైలాన్ చీరె ఉన్నాయి.

కౌసల్య కళ్ళు మెరిశాయి.

"నమస్తే సిస్టర్"

"నమస్తే కౌసల్యా, నీవింత అందంగా ఉంటావనుకో లేదనుమా"

కౌసల్య సిగ్గుపడింది.

"ఆ, దానిదేముంది" సర్దేయబోయింది కౌసల్య.

"ఈరోజు ఏమి నేర్చుకుంటారు?" మల్లమ్మ పెదవులపై మందహాసం చిందులాడింది.

"మీ యిష్టం"

"అయితే పూసలపర్సు నేర్చుకోండి" అంటూ పూసలు ప్లాస్టిక్ వైరుకి ఎలా గుచ్చాలో, డిజైనులు ఎలా వెయ్యాలో చూపెట్టింది.

"ఆ ప్లాస్టిక్ బ్యాగ్ అల్లేవిధంకూడా చూపించండి" కౌసల్య కౌతుకంతో అడిగింది.

"అన్నీ ఒకనాడేనా ? తరువాత తీరుబడి పడతారు. రోజుకొకటి నేర్చుకోండి"

"రోజూ చూస్తారుగా! అయినా చూపించండి" అంటూ కౌసల్య అనేసరికి మల్లమ్మ ప్లాస్టిక్ వైరుతో అల్లకం చూపెట్టింది.

"ఈ ఒక్క వైరుతోనే ఎందుకు? రంగురంగుల వైర్లుంటే రకరకాల డిజైన్లు వెయ్యవచ్చు"

"మీకు ఊహ చాలా ఉందే. రేపు మిగతా రంగుల వైర్లు తెస్తాను నేర్చుకుందురుగాని" మల్లమ్మ ఓడిపోయిన దానిలా ముఖం పెట్టింది.

"అలాగే" అన్నది కౌసల్య. మల్లమ్మ ఎంబ్రాయిడరీ కుట్టే విధం కూడా చూపెట్టింది.

కౌసల్య ఆనందానికి అంతులేదు. క్షణంలో మల్లమ్మ చూపిన విధంగా కుట్టి చూపెట్టింది. మల్లమ్మ ముఖంలో, ఆశ్చర్య సంభ్రమాలు ముప్పిరిగొన్నాయి.

"మీరు ఏకసంత గ్రాహులు" అన్నది మల్లమ్మ తియ్యని కంఠంతో.

"మీరు భట్రాజులా ?"

"మీకెలా తెలిసింది ?" మల్లమ్మ ముఖంమీద ఆశ్చర్యం పొడసూపింది.

"ఏం ? అలా అడుగుతున్నారు ?" కౌసల్య నవ్వింది.

"మేము నిజంగానే భట్రాజులం. మీకు జ్యోతిషం కూడా వచ్చేమిటి కొంపతీసి"

"అబ్బే! అంత అదృష్టం కూడానా, ఊరికే ఆకాశాని కెత్తేస్తుంటే, ఆ పనిచేసేది భట్రాజులేకదా అని అన్నాను." అన్నది కౌసల్య.

"అలాగా? అదెప్పుడో రాజుల కాలంలో" పకపక నవ్వింది మల్లమ్మ.

"ఏకాలంలో అయినా కులానికి సంబంధించిన అల వాట్లు మనకు తెలీకుండానే మనలో జీర్ణించి పోతాయి."

"నిజం కావచ్చు. ఈ విషయములో మీతో వాదించ లేను."

ఇంతలో మోహన్ అక్కడికి వచ్చాడు.

"హల్లో, గుడ్ మార్నింగ్ సిస్టర్" మోహన్ నవ్వు ముఖంతో అన్నాడు.

"మీకు కాలజ్ఞానం కూడా లేకుండా పోతోంతే. స్పృహలో ఉండే మాట్లాడు తున్నారా?" మల్లమ్మ గల గల నవ్వులు క్రుమ్మరించినట్లు నవ్వింది.

"ఏం? అలా అంటున్నారు?" మోహన్ తెల్ల ముఖం వేశాడు.

"ఇది మార్నింగా, ఈవినింగా?" హేళన ధ్వనిం చింది మల్లమ్మ కంఠంలో.

"సారీ, మీ ముఖం చూస్తే ఉషా కన్యని చూచినట్లని పించింది. అందువల్ల సంధ్యా సమయమైనా ప్రాతఃకాలంగానే పరిగణించవలసి వచ్చింది. ఆరీతిగానే విష్ చేశాను. మన్నిం చ, తుంతవ్యుణ్ని."

"ఊహూ, క్షమించం -" మల్లమ్మ మధురం మందహాసం చేసింది.

"క్షమించని పక్షంలో ఇంక ఉన్నది ఒక్కటే మార్గం?"

"ఏమిటో అది" అలవోకగాచూస్తూ అన్నది మల్లమ్మ.

"శిక్షించటం -" మోహన్ నవ్వేడు.

"అబ్బో! అంత అధికారమే! అది మీా శ్రీమతి కొక్కరికే పరిమితం. మాబోటి వారికి అలాంటి శక్తిసామర్థ్యాలు లేవు"

"పోనీ న్యాయమూర్తులకే మొరపెట్టుకోండి. వారే శిక్షిస్తారు" మోహన్ నవ్వేడు.

"అమ్మయ్యో! అంత సాహసమే! నిందితుణ్ని శిక్షించే బదులు ఫిర్యాదినే శిక్షించుతుందేమో."

"అలా అని ఎందుకనుకోవాలి?"

"మరి ఎంతైనా పక్షపాతం ఉండక పోతుందా! తమరి ఆరాధ్య దైవాన్ని తామే శిక్షించగల శక్తిమంతురాండ్రు ఎందరూ."

"అయితే నేరస్థుని క్షమించి విడిచి పుచ్చండి" కౌసల్య కల్పించుకుంది.

"మీారు రికమెండ్ చేస్తున్నారు కనుక ఈసారికి క్షమించటమైంది."

ప్రథమ చిహ్నంగా ఎంచి విడిచి పుచ్చుకున్నాం" మల్లమ్మ నవ్వేసింది.

కౌసల్య చిరునవ్వు నవ్వింది.

"నదినా! ఎలా ఉంది బిడ్డ" అంటూ చేతిలో ఉన్న బాబుని దింపేసు మోహన్.

చంద్రకాంత్ బాబు ఇప్పుడు సంవత్సరం పూర్తిచేసి రెండో సంవత్సరంలో కాలుపెట్టాడు.

"ఏవరీ పిల్లాడు?" మల్లమ్మ చప్పున చంద్రకాంత్ని పట్టుకొని బుగ్గలు కొరికేసింది.

కెవ్వుమన్నాడు పసి వెధవ.

"అలా మోటు సరసం చెయ్యకు సిస్టర్" అన్నది కౌసల్య.

"నాక్, ముద్దుగా ఉన్నాడు మీ కొడుకా?"

"అవును" కౌసల్య తల అడించింది. ముఖంలో మాతృదేవి మమత ముద్రితమైంది.

"బాబూ రా" అంటూ చేతులు చాచింది కౌసల్య.

బాబు బెడ్ మీదికి వెళ్ళలేదు. కౌసల్య మంచం దిగలేదు.

మల్లమ్మ పిల్లవాడ్ని మంచంమీద కూర్చోబెట్టింది!

వాడు భయం భయంగా తల్లి వంక చూస్తున్నాడు. మళ్ళీ పినతండ్రివైపు చూస్తున్నాడు!

"చిన్నాన్నా" చంద్రకాంత్ పిలిచేడు.

"దేనికి బాబూ ?"

"దించు"

"అమ్మదగ్గర ఉండు బాబూ"

"ఊఁ, ఊఁ" కళ్ళల్లో నీళ్ళు నిండి జలజల వర్షించేయి.

కౌసల్య మాతృహృదయం గాయపడింది !

సామాన్యంగా పిల్లలు తల్లికొంగు విడిచి క్షణమైనా ఉండలేరు ! అల్లాంటిది తల్లి దగ్గర కూర్చోవటానికే బెదురు తున్నాడు పిల్లవాడు !

"రా బాబూ" కౌసల్య గుండెలకి హత్తుకుంది.

చంద్రకాంత్ ఒక్కసారి గొంతెత్తి రాగాలాపన చేశాడు !

"దింపు సిస్టర్" కౌసల్య కళ్ళల్లో నీళ్ళు క్రమ్మి మసకగా కనిపించింది !

మల్లమ్మ దింపగానే తుర్రుమని వెళ్ళి బాబాయి చెయ్యి పుచ్చుకున్నాడు చంద్రకాంత్.

"బాబూ" పిలిచింది కౌసల్య.

"దేనికి వదినా ?"

ప్లాస్టిక్ వైరులూ, పూసలూ తెచ్చిపెట్టు బాబూ"

"దేనికి వదినా ?"

ఈవిడ దగ్గర పర్సులు, బేగ్‌లూ అల్లటం నేర్చుకుంటాను"

"ఓ అలాగే" కృతజ్ఞతతో మల్లమ్మవంక చూచేడు.

"థాంక్సు" అన్నాడు.

"దేనికీ" మల్లమ్మ ఉలిక్కిపడింది.

"మా వదిన దురదృష్టవంతురాలు! ఇప్పటి వరకూ కష్టపడింది! ఆవిడని ఉల్లాసపరిచే బాధ్యత మీ మీద పెడు తున్నాను."

"ఓ! అదేమీ పెద్ద ఘనకార్యముకాదు! నాకు వచ్చిన పని నేర్పటము కూడా గొప్పేనా?"

"అవును! గొప్పే! ఆపని ఎందరు చేస్తారు? ఇతర్లు నేర్చుకొని బాగుపడటము చాలా మందికి ఇష్టం ఉండదు! మీరు మహోపకారం చేసినట్లవుతుంది."

"అంతేనా? మీ వదిన చదువుకూడా నేర్చుకుంటు న్నారు!"

"అలాగా? నాకు తెలీదే"

"ఆవిడ కోరికేమిటో మీకు తెలుసా?"

"ఎలా తెలుస్తుంది?"

"ఆవిడకూడా మాలాగే సిష్టరు కావాలని అభిలాష పడుతోంది. లోకసేవ చెయ్యాలని ఆవిడ ఉద్దేశ్యం"

"అలాగా? అంతకన్నా కావలసిన దేముంది? అది నిజంగా అభినందించవలసిన విషయం. ఒకరికి మేలు చెయ్యా లనుకోవటం గర్వించదగ్గ విషయం

తాను మీ సహాయంతో ఆరోగ్యం కోలుకొంటోంది అందువల్ల తనూ మరికొందరికి ఆ భాగ్యం కల్గించాలని ఉవ్విళ్లూరుతోంది."

"అలా చదువుకుంటానంటే నాకు చాలా సంతోషం. ఎంత ఖర్చయినా భరించగలను"

"మీ మీద ఆ భారము పెట్టదలచలేదట! స్వయం శక్తితో, చదువుకోవాలనీ, తన కొడుకుని పెద్ద చదువులు చదివించాలనీ ఆవిడ ఉద్దేశ్యం"

మోహన్ ముఖం చిన్నబోయింది! తన సహాయం లేకుండా వదిన తననీ తన బాబునీ పోషించుకో చూస్తున్నది! పోనీ అదీ ఒకందుకు మంచిదే! అనుకున్నాడు మనస్సులో.

ఇంతలో విజిటర్సు హాస్పిటల్‌లో ఉండే టైము అయిపోయింది!

మోహన్ చంద్రబాబుని ఎత్తుకుని బయలుదేరాడు.

"నమస్తే సిస్టర్"

"నమస్తే" మల్లమ్మ పెదవులపైన చిరునవ్వు మొలిచింది.

"వస్తాను వదినా"

"మంచిది బాబూ" కౌసల్య పరధ్యానంలో పడిపోయింది.

"కౌసల్యా"

"ఏమిటే –" కౌసల్య ఉలిక్కిపడింది!

"మీ మనస్సు యిక్కడ లేదే! ఈ రోజుకి కట్టిపెడ దామా?"

"అవి నా దగ్గర వదిలి వెళ్ళండి, రేపు చూపిస్తాను" అన్నది కౌసల్య!

"అలాగే"నంటూ సిస్టర్ వెళ్ళిపోయింది. కౌసల్య పర ధ్యానంలో పడిపోయింది మళ్ళీ!

ఇంతలో సాయంత్రపు భోజనము వచ్చింది!

కౌసల్య రొట్టె పాలు తీసుకున్నది! త్వరగా మోహన్ తెచ్చిన భోజనం పూర్తిచేసింది.

ప్లాస్టిక్ పర్సు అల్లకం పూర్తిచేసింది. లోపల సాదా పర్సుపెట్టి జిప్ పెట్టటం మాత్రం మిగిలింది.

కౌసల్య తృప్తిగా నిట్టూర్చింది!

పూసల పర్సు అల్లబోయింది లైట్లు తీసేశారు! కౌసల్య మంచముమీద ఒరగక తప్పలేదు!

భవిష్యత్తుని ఊహించుకుంటూ తియ్యటి భావాల మధ్య తేలియాడుతూ కళ్ళు మూసింది! నిద్రాదేవి కౌసల్యని తన ఒడిలోకి తీసుకొని జోకొట్టింది.

కౌసల్య మెల్లగా గోడలు పట్టుకుని నడుస్తోంది!

"వదినా" మోహన్ పిలిచాడు! కౌసల్య తలెత్తి చూచింది!

"ఎప్పటినుంచి నడుస్తున్నావ్?"

"నీకు తెలీదా? పదిరోజుల్నించి ప్రయత్నం చేస్తున్నాను. రోజూ యింజక్షనులు యిస్తున్నాను. అందువల్ల కాస్త గుణం కనిపిస్తోంది!

"అదృష్టవంతురాలు చంద్రకాంత" మోహన్ కళ్ళు మెరిశాయి.

"అవును బాబూ, మళ్ళీ ఆపరేషను చేస్తారట! దానితో పూర్తిగా నడకరావచ్చు!"

"అంతకంటే అదృష్టమేముంది?" మోహన్ స్టూలు మీద కూర్చుంటూ అన్నాడు.

బాబు అక్కడ ఆడుతున్నాడు! బాబుకి రెండు సంవత్సరాలు వెళ్ళిపోయాయి! మాటలుకూడా వచ్చాయి.

"బాబూ, ఎవర్రా ఆమె?"

"అమ్మ" బాబు ముద్దు మాటలతో చెప్పాడు.

"మా బాబే" కౌసల్య బాబుదగ్గరికి వడిగావచ్చింది తెలీకుండానే!

నరాలు కలుక్కుమన్నాయి!

నడుము పూర్తిగా లేచింది! బాబుని గుండెలకి హత్తుకుంది కౌసల్య!

"వదినా" మోహన్ సంతోషంతో కేక పెట్టాడు.

"ఎవరా అరిచేది?" దాయీ కేకపెట్టింది.

"ఏమిటి?" కౌసల్య ఆశ్చర్యపోయి అడిగింది!

"నీవు మామూలుగా నడుస్తూనే ఉన్నావుగా! ఇక ఇంటికి పోవచ్చు" ఉత్సాహంతో అన్నాడు.

"అవును డాక్టరుగార్ని అడిగి వచ్చేస్తాను. బాబూ, నాకు వేరేఎక్కడైనా ఒకగది చూచిపెట్టు" అన్నది కౌసల్య.

"దేనికి" మోహన్ ముఖం నల్లబడింది.

"నేనా యింట్లో ఉండదలచలేదు. నా పొట్ట నేను పోసుకోగల స్థితికి వచ్చాను దేవుడిదయవల్ల. నాభారం మీ మీద ఉంచడం బాగాలేదు"

"వదినా" మోహన్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏడుస్తున్నావా బాబూ? యిది నిజంగా సంతోషించవలసిన సమయం. నన్ను నేను పోషించుకోగల స్థితికి వచ్చానంటే ఆనందిస్తావని ఆశిస్తా"

"అవును, వదినా! నాది పొరపాటే! ఇకముందెప్పుడూ యిట్లాచేయను" మోహన్ హీనముఖంగా కూర్చున్నాడు.

"వెళ్ళనా వదినా" అంటూ లేచాడు.

కొంతసేపు అయ్యాక "మంచిది బాబూ" కౌసల్య ఉత్సాహంగా వీడ్కోలు చెప్పింది.

మోహన్ వెళ్ళిపోయాడు.

ఆ తరువాత నాలుగురోజులకే కౌసల్య విడుదల పొందింది! మళ్ళీ ప్రపంచంలోకి వచ్చింది!

అంతా క్రొత్తగా అగుపిస్తోంది. వింతగాచూస్తోంది-కౌసల్య చిన్నపాప మాదిరి.

మోహన్ చూసిపెట్టిన గదిలో దిగేరు కౌసల్యా, చంద్రకాంత్ బాబు.

మోహన్ ఉత్తచేతుల్తో యిల్లుచేరాడు. ఏదో లోటు కనిపిస్తోంది! తాను యింతకాలంపడ్డ శ్రమ వృథా! కౌసల్యా స్వయంగా కష్టించి బ్రతకాలని పట్టు పట్టింది!

"బాబేడీ" సావిత్రి ప్రశ్నించింది.

"వదిన దగ్గర విడిచిపెట్టాను"

"ఎక్కడ ?"

"వదిన వేరే యింట్లో దిగింది. అక్కడే వదిలిపెట్టాను."

"ఏమిటీ-" సుమిత్ర ఆత్రముగా అక్కడికి వచ్చింది.

"వదిన వేరుగా ఉంటానని వేరేచోట దిగింది."

"ఏ వదిన" అర్థంకానట్లు అడిగింది సుమిత్ర.

"కౌసల్య" అంది సావిత్రి అక్కసుతో ముఖం చిట్లించి.

"ఓహో! మంచిపనే చేసింది! ఎంతో ఆలోచించిన మీదట చేసినట్లు కనిపిస్తూనే ఉంది"

"ఎమిటా ఆలోచన" సావిత్రి మండిపోతూ అడిగింది.

"ఏవిటో నీకు తెలీదా?" అంటూ రెట్టించింది సుమిత్ర.

"ఊహూం."

"అయినా ఒకరిజోలి నాకెందుకులే" అంటూ మాటని విరిచి వెళ్ళిపోయింది సుమిత్ర!

"ఆవిడ తీరు అంతేలేబాబూ, నీవేమీ బెంగెట్టుకోకు" మాడిపోయిన మోహన్ ముఖంచూచి అన్నది సావిత్రి.

మోహన్ సమాధానం చెప్పకుండా లేచి వెళ్ళిపోయాడు.

"ఒసే మాధవీ, ఈ విషయం విన్నావుటే."

"ఏమిటది?" పిల్లవాడి చొక్కాకి గుండీలు కుడుతూ అడిగింది మాధవి.

"కౌసల్య వేరే కాపరం పెట్టిందట."

"ఎవరూ?" మాధవి అర్థంకాక అడిగింది.

"ఇంకెవరు? ఆ వగలాడి వదిన! మీ తోడు కోడలు" తనకి తోడుకోడలు కానట్లు మాట్లాడింది.

"నీకుమాత్రం తోడుకోడలు కాదూ."

"అయినా అది చిచ్చుపెట్ట తల్చింది నీ కాపరానికే! అందువల్ల జాగ్రత్త పడటం మంచిది."

"ఎల్లా పడను?"

"నీవు వెళ్ళి ఒక్కదానివీ ఏముంటావులే అని పిల్చుకురా."

"దేనికి? చారిన పోయే తద్దినమా మాయింటికి రమ్మని"

"అది యిక్కడుంటే మనం చూస్తాం. ఉండొచ్చు. ఒక్కతే ఉంటే ఏంజరుగుతున్నదీ మనకెలా తెలుస్తుందీ? ఇన్నాళ్లూ హాస్పిటల్ చుట్టూ తిరిగినవాడు రోగం నయమై అదివస్తే వదిలిపెడతాడా?"

"అంటే-"

"అంటే ఏముంది? ఆవిడ తనచుట్టూ త్రిప్పుకొంటుండి ఇంక నీ నోట మట్టిగడ్డే"

"ఏం?"

"ఏమిటా? చీరెలూ, సారెలూ, డబ్బూ దస్కం నగా నట్రా అంతా దాని పెట్టెలో చేరిపోతాయ్"

"అలాగా?"

"అవును. అందుకని నీవు వెళ్ళి పిల్చుకురా"

"ఆవిడ రానంటే-"

"మీ ఆయన్నికూడా తోడు తీసుకెళ్లు"

"ఆయన రాకపోతే"

"ఎందుకురాడూ? వస్తాడు! అయినా పథకం వేసి చూడు! మన పాచిక పారిందో నీవు గట్టున పడ్డట్లే"

"ఆ హాస్పిటల్లో చావక వాళ్ళు బ్రతికి బయటపడిందే నా కొంప ముంచటానికి"

"పాపీ చిరాయువూ అని వూరికే అన్నారూ?"

"అవును అల్లాగే అగుపిస్తుంది."

"అయితే నేను చెప్పినదానికి ఒప్పుకొన్నట్లేనా?"

"ఆ"

అప్పటికి ప్రొద్దుగూకింది!

మోహన్ తిరిగిచ్చాడు.

"ఏమండీ" మాధవి గడపలోనే భర్తని పలకరించింది.

"ఏమిటి?" ఆశ్చర్యపోయి అడిగేడు మోహన్. భార్య తనంతట తాను పలకరించి ఎన్ని సంవత్సరాలైందో! తానుగా పిలిస్తేనే ఒకపట్టున పలకదు!

"అక్క హాస్పిటల్నుంచి వచ్చిందటగా"

"అవును."

"ఆవిడ్ని ఎక్కడ దింపేరు?"

"వేరే యింట్లో దిగింది" క్లుప్తంగా జవాబిచ్చేడు.

"అది మన కుటుంబానికి అవమానం కదూ?"

"ఏం? ఎందుకూ?"

"ఇంతమంది మేముండగా పెట్టి పోషించలేక గెంటేశారని లోకులనుకోరూ?"

"మనమేమీ గెంటివెయ్యలేదుగా లోకులనుకోవటానికి."

"అయితే తిన్నగా యింటికిరాక హాస్పిటల్నుంచి వేరే యింట్లోకి ఎలా వెళ్ళింది? మీరే వేరే యిల్లు చూసి పెట్టి ఉంటారు."

"అయితే కావచ్చు. అడిగితే ఆ మాత్రం సాయమైనా చెయ్యకపోతే బాగుండదుగా."

"ఆవిడ్ని మీరే ప్రోత్సహించారన్నమాట."

"అలా అని ఎందుకనుకోవాలి. ఆవిడంతట ఆవిడ అడిగితే చూచిపెట్టానని అనుకోరాదూ?"

"అసంభవం. ఆడది ఒంటరిగా ఉండటానికి సాహసించదు. మగవాడి అండదండలు లేకుండా ఒక్క స్త్రీ ఉండలేదు. మీ అండచూచుకొనే అలాచేరి ఉంటుంది.

"నా అండ కోరేదైతే ఈ యింటికే వచ్చేది. ఆవిడ ఎవరి సాయమూ కోరదలుచుకో లేదట. స్వయం కృషిమీద బ్రతకాలనుకుంటోంది."

"నిజమే నంటారా? స్వయముగా ఎలా బ్రతుకుతుంది? మగవాడి సంపాదన మీదకదా ఆడది బ్రతికేది."

"వెర్రిదానా! అది వెనకటి కాలములో. ఇవ్వాళ ఎవరూ ఇతరుల సంపాదనమీద బ్రతకడంలేదు. ముఖ్యంగా మధ్యతరగతి, చివరితరగతివారంతా ఎవరి కష్టంమీద వాళ్ళే బ్రతుకుతున్నారు. స్వయంగా కష్టించి సంపాయించి పోషించే భర్త లెందరుంటారు? ఎక్కడో కొద్దిమంది నీలాంటి నాలాంటి వాళ్ళుంటారు"

"అయితే ఎలా బ్రతుకుతుందట"

"అది ఆవిడ వ్యక్తిగత విషయం. అందులో మనకే పమేయం అనవసరం"

"అయితే పిలవ వద్దంటారా ?"

"నీ యిష్టమైతే వెళ్ళి అడుగు. నేను మాత్రంరాను. అయినా ఆవిడమాత్రం ఎలా వస్తుందని నీ ఉద్దేశ్యం? రోగంతో బాధపడుతుంటే ఒక్కరైనా కనుక్కున్నారా? ఎలా ఉన్నదోనని వెళ్ళిచూచారా?"

"ఉహూ" మాధవి పెదవి విరిచి తల వాల్చేసింది.

మౌనముగా లోపలికి వెళ్ళిపోయింది.

---

# 12

"అక్కా"

"ఎవరూ ?" కౌసల్య బైటికి వచ్చింది.

"నేనే నక్కా" మాధవిని చూచి విస్తుపోయింది కౌసల్య.

"దేనికిలా వచ్చావు మాధవీ"

"ఏం ? రాకూడదా అక్కా ?"

"ఎందుకు రాకూడదూ ? అయినా నీవు వస్తావని అనుకోలేదు. అందుకని అలా అడిగేను."

"పోనీ వచ్చానుగా, లోపలికి రమ్మంటావా, వెళ్ళి పొమ్మంటావా ?"

"అంతమాట నీ అక్క అనగలదా మాధవీ. రాక రాక వచ్చావు. కూర్చోవటానికి చాప అయినాలేదు. ఈ బొంతమీద కూర్చో." కౌసల్య సిగ్గుపడింది.

"ఎక్కడ కూర్చుంటే ఏమిలే అక్కా. అయితే యిప్పుడు ఒంట్లో కులాసాగా ఉందా ?"

"ఊ"

"చంద్రకాంత్ ఏమి చేస్తున్నాడు"

"పిల్లల్తో ఆడుకోవటానికి పోయాడమ్మా"

"నీవు ఇలా ఒంటరిగా ఉండటము నాకేమీ బాగా లేదక్కా"

"ఏమి చెయ్యమంటావు చెల్లీ. జంటగా బ్రతికే అదృష్టానికి నేను నోచుకోలేదు. భగవంతుడు నా నుదుట మసి పూశాడు." కౌసల్య కొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

"ఎబ్బె! నా ఉద్దేశ్యం అది కాదక్కా! నిన్ను గాయ పరచాలన్న ఉద్దేశ్యంతో అడగలేదు. అక్కడికి రాకుండా ఇలా ఒంటరిగా ఉండటం బాగా లేదన్నాను అంతే."

"ఎన్నాళ్ళని యితర్ల కష్టం మీద బ్రతకను చెల్లీ. ఒకళ్ళము కాదు. ఇద్దర్ని పోషించి, చదువు సంధ్యలూ చెప్పించాలంటే మాటలా?"

"అయితే ఎలా బ్రతకదల్చావు అక్కా. ఈ ప్రశ్న వేసినందుకు నీకు మనస్సు కష్టంగా ఉంటుందేమో! కాని కేవలం కుతూహాలం కొద్దీ అడుగుతున్నాను."

"ఎలాగంటే చెప్పమంటావా? ఎంబ్రాయిడరీ కుట్టటం, బట్టలు కుట్టటము. ఇలా ఏ పని దొరికితే ఆ పని చేయదలచుకున్నాను."

"నీకు బట్టలు కుట్టటం వచ్చా అక్కా" మాలతి ఆశ్చర్యపోయి అడిగింది.

"పూర్వం రాదనుకో. కాని యిప్పుడు నేర్చుకుంటున్నా."

"ఎక్కడ"

"ఎక్కడైనా నేర్చుకోవచ్చు. స్త్రీల సంక్షేమ కేంద్రా లున్నాయి. కోఠీలో ఒకటి ఉన్నది. యువతీ మండలిలో ఒకటి ఉన్నది."

"అలాగా? నా కింతవరకూ తెలేదే. మాధవి సిగ్గు పడుతూ అడిగింది.

"నాకూ తెలియదు. కాని సిస్టర్ దయవల్ల తెలుసు కున్నాను. ఆవిడే నాకీ ధైర్యం యిచ్చింది. స్వయంగా నా కాళ్ళమీద బ్రతక గలనని హామీ యిచ్చింది. అంతే కాదు. చదువు కూడా ఆవిడే నేర్పుతుంది."

"ఏమిటీ నీవు చదువుకుంటున్నావా?" ఆశ్చర్యం యినుమడించింది మాధవి కంఠంలో.

"అవును చెలీ, ఆ పని చిన్నప్పుడే చెయ్యవలసింది. అందు కవకాశమూ లభించలేదు; ఆలోచనా కలగలేదు. నేడు దాని అవసరం కలిగింది. నేర్చుకుంటున్నాను" కౌసల్య గాద్గదిక స్వరంతో అన్నది.

"నీ వింతగా మారిపోతావనుకోలే దక్కా; నీకా జ్వరం కీడులో మేలు చేసింది."

"మేలే కాదు చెల్లీ, మహోపకారం చేసింది. అంధకారంలో అలమటించే నాకు జ్యోతిని చూపించింది. ఎన్ని కష్టాలైనా ఓర్చి ఆ మార్గమే త్రొక్కాలనుకుంటున్నాను."

"మంచి పని చేశావక్కా, పోయివస్తాను" మాధవి ముఖంలో ప్రశాంతత వెలిసింది.

"అలాగేనమ్మా ఎప్పుడైనా వస్తా ఉంచు" కౌసల్య లేచి నిలబడింది. రెండు ముగ్గిపోయిన అరటిపండ్లు తెచ్చి మాధవి చేతుల్లో పెట్టింది.

"నీ అక్క యింతకన్నా ఏమీ ఇవ్వలేను చెల్లి. ఈ బీద అక్కని క్షమించు"

"క్షమించే దేముంది అక్కా! నీవు ఉన్న దాంట్లో పెట్టావు అందులో తప్పేమీ లేదు. వస్తా నక్కా" అంటూ బయలుదేరింది మాధవి మధుర భావాల్ని మనస్సులో నింపుకుని.

మాధవి రిక్షా దిగుతుండగా సుమిత్ర ఎదురైంది.

"ఎక్కడికి వెళ్ళావు మాధవీ" ఆశ్చర్యంతో నోరు తెరిచి అడిగింది సుమిత్ర.

"అక్కని చూడటానికి వెళ్ళాను."

"ఏ అక్కా" అర్థంకాక తెల్లముఖం వేసింది సుమిత్ర.

"కౌసల్య"

"ఏమిటే! దాన్ని చూడటానికి పోయావా? ఏమిటి విశేషాలు? నాతో మాట మాత్రమైనా అనలేదే బాగా దెప్పిందా? తిట్టిందా?" సుమిత్ర కంఠంలో హేళన ధ్వనించింది.

"ఆ రెండిట్లో ఒక్కటీ చెయ్యలేదు. పైగా ఎంతో తియ్యగా మాట్లాడింది" మాధవి కంఠంలో కోపం, అసహ్యం కలగలపుగా ధ్వనించాయి సుమిత్రపై.

"అబ్బో! అయితే గొప్ప విందు చేసిందన్నమాట! ఉత్త అమాయకురాలివి మాధవీ. ఇట్టే ఉబ్బిపోతావు! బాగా పొగిడిందన్నమాట! అవును. తెలివి కలది కాబట్టి పొగిడి ఉంటుంది. అట్టి ఉంటే నీవూ కూడా అప్పుడే తెగబడి ఉండావు. మంచి చేసుకోవటానికి నిన్ను దువ్వింది. ఆ మాత్రం గ్రహించలేక పోతివి. నేనైతేనా–" అహంభావంతో చూచింది సుమిత్ర.

"ఏమిటి చేసేదానివే" మాధవి కోపం అవధులు దాటింది.

"ఏమిచేసే దాన్నో యిప్పుడెందుకులే. నాలుగు అడిగేసే దాన్ని. దానితో అమ్మగారి ముఖం ముడుచుకొని మూలకి పరుగెత్తేది" సుమిత్ర పకపక నవ్వింది.

"నీవు వెడితే తెలిసేది మూలకి పరుగెత్తి ఎవరు కూర్చుండేవారో" గలగల నవ్వింది మాధవి.

"అయితే బాగానే బుట్టలో వేసిందన్నమాట! నీవు యింతగా ఆవిడ తరఫున వాదిస్తున్నావంటే ఎంతగా మార్చేసిందో తెలుస్తూనే ఉంది. దీన్నిబట్టి ఆవిడ తెలివి తేటలు అంచనా వెయ్యవచ్చు."

"అవును మారకుండా నీ చెప్పు చేతల్లో ఉంటమంటావు. మంచిని మంచిగా చూడలేని వాళ్ళకి అలాగే ఉంటుందిలే."

"ఏమిటాం మంచి? మొగుణ్ణి పరలోకానికి ప్రయాణం చేయించి మనిషిని బుట్టలో వేసుకొని కులకటమేనా?"

"అని నీకెలా తెలుసు?" మాధవి పళ్ళు పటపట కొరుకుతూ అడిగింది.

"తెలియటంలే! ఆవిడ ఒంటరిగా బ్రతుకుతుందట. ఎలా బ్రతుకుతుంది? ఈవిడేమీ బిఏలు ఎమ్మేలు వెలగ బెట్టలేదు ఎవరైనా ఉద్యోగం యిచ్చారనడానికి! ఎలా బ్రతుకుతుందీ! నీవే చెప్పు" సుమిత్ర గలగల నవ్వింది.

"చదువూ, ఉద్యోగంవల్ల తప్పితే బ్రతక లేరంటావు. అంతేనా? ఆవిడ బట్టలు కుట్టుకుని బ్రతుకుతోంది."

"అఘోరించ లేకపోయిందీ! దాని బ్రతుకు బండలు గాను! అంత అప్రతిష్ఠ బ్రతుకు బ్రతక్కపోతేనేం? ఛీ! ఛీ! చెప్పుకోవటానికి సిగ్గెట్లా లేదో."

"సిగ్గుదేనికీ? మొగుడు సంపాదించి తెస్తే టింగు రంగా అని గొప్పలు పోవటమూ ఒక ఘనమైన బ్రతుకే" మాధవి హేళనగా నవ్వింది.

"ఏవిటర్రా ఆ తగాదా?" సావిత్రి అక్కడికి వచ్చింది.

"చూడక్కా! అనవసరంగా యితరులు జోలి మన కెందుకు? చూడనివన్నీ కల్పించి అపవాదులు అంటగట్టట మెందుకు?" మాధవి ఫిర్యాదు చేసింది.

"అసలు సంగతి ఏమిటి."

"ఏముంది! నేను కౌసల్య అక్కని చూడటానికి పోయాను. ఆవిడకీ - మా ఆయనకి నీచపు సంబంధం అంట కట్టుతోంది."

"అని నేనన్నానటే! ఓసి, ఎంత గడసరివే, నేనామాట అన్నానటె"

"ఇందాకటి నుంచి అనేది అదే కదూ!"

"అయినా, కట్టుకున్నదానివి నీకు లేకపోతే నాకెందుకు బాధ? కందకులేని దురద కత్తిపీటకు దేనికి?" అంటూ సుమిత్ర అక్కడినుంచీ జారుకుంది.

"ఏమిటి మాధవీ! ఆవిడ తత్వం అంతే! నీవు బాధ పడకు. మన బంగారం మంచిదైతే కంసాలిని అనటందేనికి! నిజానిజాలు ఆ భగవంతుడికే ఎరుక! మరిదికి ఆవిడ అంత అభిమానం ఉన్నమాట నిజం. ఆ నిజాన్ని చూచి ఓర్వలేక ఏవో అబద్ధాలు కల్పించి కథ అల్లుతుంటారు కొందరు. వాటిని పట్టించుకోకూడదు. నీకేమైనా అన్యాయం జరిగితే చెప్పు. అప్పుడు ఆలోచిద్దాం."

"అలాంటిదేమీ లేదక్కా."

"అయితే ఊరుకో. మౌనాన్ని మించిన మందు లేదు. రెండుచేతులూ చేరితేనే చప్పట్లు వస్తాయి."

"అవునక్కా అదీ నిజమేలే." అంటూ మాధవి లోపలికి వెళ్ళింది.

---

# 13

"కౌసల్యా, కంగ్రాచ్యులేషన్సు" సిస్టర్ బయటి
ంచే కేక వేసింది.

"ఎవరూ? సిస్టర్, మీరా! రండి ఏమిటీ విశేషం?"
సల్య నవ్వుతూ ప్రశ్నించింది.

"నీకు ట్రైనింగుకి సీటువచ్చింది. రేపు వెళ్ళి జాయిన్
కావాలి"

"ఎక్కడా?"

"హాస్టల్‌లో ఉండి రెండు సంవత్సరాలు ట్రైనింగ్
పొందాలి. ఆపైన ఉద్యోగం వస్తుంది."

"మరి బాబో" కౌసల్య సందేహం వెలిబుచ్చింది.

"మీ వాళ్ళ దగ్గర వదిలిపెట్టు"

"ఎవరు తీసుకుంటారా బాధ్యత!"కౌసల్యనిట్టూర్చింది.

"అయితే ఎలామరి?"

"మానుకోవలసిందేనా? కౌసల్య కళ్ళలో ఆతృత
తొంగిచూచింది.

"ఎందుకూ? పోనీ బోర్డింగులో చేర్పిస్తారా?"

"డబ్బు కట్టవద్దూ?"

"అవును, కట్టాలి. ఎలాగో సర్దుకోవాలి. ఏం? నీ కా ధైర్యంలేదూ?" సిస్టరు అడిగింది.

"మరి నాకూ ఖర్చులుంటాయిగా."

"ఉంటాయి, అవును ఎలాగో సంపాదించాలి"

"పని చేసుకోపటానికి తీరిక ఉంటుందా?" కౌసల్య ఆతృతగా అడిగింది.

"చాలా శ్రమపడవలసి వస్తుంది.

"నేనూ తగినంత సాయంచేస్తాను." సిస్టర్ ఆ కాయితం యిచ్చివెళ్ళింది. కౌసల్య ఆలోచన్లతోటి కాలం గడిపింది.

"వెళ్ళటమా? మానటమా?" అన్న సందిగ్ధంలో పడింది.

వెళ్ళకపోతే బాగుంటుందా? సిస్టర్ సాయంతో తాను మెట్రిక్ ప్యాసయింది.

ట్రైనింగు సీటుకి ఆమే ప్రయత్నం చేసింది!

తీరా సీటువచ్చాక చేరనంటే ఆవిడ తన ము చూస్తుందా?

వచ్చిన అవకాశాన్ని కాళ్ళదన్నుకుంటే కా వ్వాడు తిరిగివస్తుందా?

"ఏమైనా చేరవలసిందే. మరి బాబ్ - బోర్డింగ్‌లో ఉంచమన్నది కదా !

ఏమైనా కష్టపడవలసిందే !

దృఢనిశ్చయం ఏర్పడింది కౌసల్య మనస్సులో.

బాబుని గుండెల కదుముకున్నది. అలానే నిద్ర కొరిగింది.

---

# 14

"కౌసల్యా, రింగ్ టెన్నిస్ ఆడదాం వస్తారా!" శోభన అడిగింది.

"ఉహూ, నాకు తీరదు శోభనా"

"ఎప్పుడూ పనిచేస్తే బుర్ర చెడిపోతుంది. కాస్సే పయినా సరదాగా గడపవేం?

"నీకెల్లా తెలుస్తుంది శోభనా? బాధ్యతల బరువుతో క్రుంగిపోతున్న నేను నీలా సరదాగా ఎలాగడపను చెప్పు? నీవు చిన్నపిల్లవి. జీవితం చవిచూడని దానివి" కౌసల్య నవ్వింది.

"ఎప్పుడూ ఏదో కుడుతూనే ఉంటావు? అవి ఎవరికి?"

"నా అక్కలకీ, చెల్లెళ్ళకీ"

"ఎందరున్నా రేవిటి అక్కలూ, చెల్లెళ్ళూ" శోభన నవ్వుతూ అడిగింది.

"అబ్బో - చాలమంది" కౌసల్య కళ్ళు పెద్దవిచేసి చెప్పింది.

"లెక్కపెట్టలేనంత మందా?"

"ఆ! నక్షత్రాలెన్ని ఉన్నాయో లెక్కపెట్టగలవా? అంతే వాళ్ళున్నూ"

"అంతమందిని మీ అమ్మ కన్నదా?" శోభన పక పక నవ్వింది.

"మా అమ్మలాంటి అమ్మలు కన్న అక్కలూ, చెల్లెళ్ళూ"

"అయితే అంతా తమాషాయేనా? నిజంచెప్పు. ఎవరి కోసం యివన్నీ కుడుతున్నావు?"

"పిచ్చిపిల్లా! పొట్ట పోషించుకోవటాని కివన్నీ కుడుతున్నాను. అర్థమయిందా?"

"వచ్చే స్త్రయిఫండు ఏమిచేస్తున్నావు! ఎంతతిండి తింటావేం? కొంపతీసి భీముడికి చెల్లెలవు కావు గదా నీవు" శోభన నవ్వింది.

"అవును చెల్లెల్నే. ఏం భయమా నీకు?"

"భయం కాదూ!"

"అయితే దూరంగా ఉండకూడదూ?"

"అయితే నిజం చెప్పవన్నమాట. ఎవరికోసం యిలా రాత్రిం బవళ్ళు విశ్రాంతి లేకుండా శ్రమిస్తున్నావు?"

"ఎవరికోసం తల్లి కష్టపడుతుందో చెప్పగలవా?"

"తన సంతానం కోసం."

"సరిగ్గా ఊహించావు. మరి తెలీదని అడుగుతావేం?"

"అయితే నీకు పెళ్ళయిందా అక్కా?" ఆశ్చర్యంగా అడిగింది శోభన.

"అవును అయింది."

"మరి బావ నిన్నూ - పిల్లల్నీ పోషించడా ?"

"ఊహూ."

"ఏం ? చాలా చెడ్డవాడా ?"

"లేదు చెల్లీ. అంత అదృష్టానికి నోచుకోలేదు" కౌసల్య కళ్ళు అశ్రు పూరితా లయ్యాయి.

"బావ చనిపోయారా అక్కా" అమాయకంగా అడిగింది శోభన.

"అవును చెల్లీ, నా దౌర్భాగ్యాన్ని నాకే వదిలి పోయారు."

"పిల్లలెంతమంది అక్కా"

"ఒక్కడే చెల్లీ"

"పేరేమిటి ?"

"చంద్రకాంత్"

"ఎక్కడున్నాడు ?"

"చదువుతున్నాడు. బోర్డింగ్‌లో చేర్పించాను"

"అతని కోసమా ఈ శ్రమ అంతానూ, నీవెంత మంచిదానివి అక్కా."

"పిచ్చిదానా, ఇందులో మంచేముంది ? కన్న సంతానాన్ని పోషించటం కన్నతల్లి కనీస ధర్మం చెల్లీ."

"అయితే నీవు రావన్నమాట"

"రాలేను చెల్లీ."

"సరేలే, నేనూ వెళ్ళను. నీ గురించి చెప్పవా అక్కా?"

"ఏమున్నది చెల్లీ చెప్పేందుకు? విన్నావుగా అంతే మరి."

"అయితే నీవు ఉద్యోగంచేసి అతడిని చదివిస్తావా ?"

"అదే ఉద్దేశ్యం. దైవేచ్ఛ ఎలా ఉందో" కౌసల్య కళ్ళు నీళ్ళతో నిండి కనిపించలేదు. సూది చేతికి గ్రుచ్చుకుంది.

"శోభనా ! ఆటకి రాలేదేం, మేము అంతా ఈ రోజు పిక్చరుకు వెడుతున్నాము. వార్డెనుకి చెప్పాం."

"నేను రాను అక్కా."

"అదేం ?"

"కౌసల్య అక్క వస్తే నేనూ వస్తాను."

"కౌసల్యా నీవు రావూ ?"

"లేదు చెల్లీ, రాలేను."

"ఏం !"

"ఒంట్లో బాగాలేదు. పైగా పరీక్షలొస్తున్నాయి."

"అవున్లే, ఫస్టు మార్కులన్నీ నీకేగా వచ్చేది. నీవు ఫస్టున ప్యాసుకావద్దూ."

"పోనీ అలాగే అనుకో. ఒక బాధ్యత నెత్తినేసుకొని వచ్చిన దాన్ని దాన్ని ఎలా విస్మరించను చెల్లీ."

"చదువు ఎక్కువైతే మతి చెడుతుంది. విశాఖపట్నం వెళ్ళాల్సొస్తుంది" నవ్వింది అరవింద.

"పోనీ అదీ మంచిదే. ఈ బాధల బరువైనా తప్పు తుంది. కులాసాగా అందరిలా తిరుగుతాను."

"అంత బాధేం వచ్చింది?"

"ఏమీ లేదులే, ఊరికే అలా అన్నాను. కానీ వెళ్ళిరా నీతో శోభనను కూడా తీసుకెళ్ళు."

"నేను పోను, నా యిష్టం. నన్ను బలవంతం చెయ్య టానికి మీరెవరు?" శోభన బుంగమూతి పెట్టింది.

"ఇదుగో ఇప్పటినుంచే ఇలా ఒంటరిగా ఉండటం మంచిది కాదు శోభనా. వెళ్ళు కులాసాగా తిరుగు."

"నాకు చెప్పేదానివి నీ వెందుకు ఆచరణలో పెట్టవూ? నీవు ఆచరించలేనిది ఇతరుల కెందుకు ఆదేశిస్తావు?"

"నేను పెద్దదాన్ని. నా వయస్సు అయిపోయింది. ఇప్పుడు బాధ్యతల్ని గమనించవలసిన వయస్సు నాది. అందరి పరిస్థితులూ ఒకటి కావు. ఎవరి పరిస్థితినిబట్టి వారు నడుచు కోవాలి."

"నా పరిస్థితి నాకన్న నీ కెక్కువ తెలుసేంటి?"

"పోనీ తెలియదనే అనుకుందాం, నీతో నేను వాదించ లేను. ఉండి ఏం చేస్తావు? తోచటం లేదని నన్ను వేధిస్తావు. నా పనీ పాడు, నీ సరదా తీరదు."

"అయితే మరి కదులు."

"ఉహూఁ"

"అలా అంటే వీలులేదు. వస్తేగా లేకపోతే నేనూ పోను."

"అవిడతో నీవూ పోతావా ఏమిటే" అంటూ ఇందిర నవ్వింది.

"ఆ! ఆ సంగతి నీకెందుకు? నీవు వెళ్ళు" శోభన కసిరింది.

"సరే! మీ యిష్టం. నేనుపోతున్నా" అంటూ ఇందిర వెళ్ళిపోయింది.

కౌసల్యను దగ్గు వచ్చింది.

"దేనికలా దగ్గుతున్నావు? డాక్టరుకి చూపించుకోరాదూ?"

"చూపిస్తే పరీక్షలకి పోనివ్వరు."

"పోనివ్వకపోతే మరో సారి పోవచ్చునులే."

"ఊహూఁ, ఇంతకాలం చదివి పాడు చేస్తానా? ఈనగాచిన పొలం నక్కలపాలు చెయ్యమన్నావా?"

"అయితే రోగం ముదిరేదాకా చేస్తావా? దగ్గు రావటం మంచిది కాదు."

"మంచిది కాకపోతే రానేరాదు. అది నాకు మంచిదనే భగవంతుడు రప్పించాడు."

"అయితే బ్రతకటం నీకిష్టంలేదా?" శోభన కోపంగా అడిగింది.

"ఆ మాట నేనన్నానా !"

"అనటం లేదు-చేసి చూపిస్తున్నావు. వదుకో ఇక" కౌసల్య చేతిలోనుంచి బట్టలు తీసేసింది.

కౌసల్య నిట్టూర్చి పుస్తకం తీసింది.

"ఇప్పుడేం చదువు! తీసెయ్యి" అంటూ పుస్తకం లాగేసింది శోభన.

"అయితే నన్నేపని చెయ్యనివ్వవా శోభనా ?"

"ఊహూ"

"దేనికి నామీద యింత కోపం."

"కోపం కాదు అభిమానం."

"అభిమానం ఉంటే నేను చెప్పినట్లు నడవాలి. కానీ నన్నే ఆజ్ఞాపిస్తే ఎలా ?"

"ఆజ్ఞాపించనూవచ్చు, ఆరాధించనూ వచ్చు అది నా యిష్టం"

"నీ యిష్టం నాకు లేదూ ?"

"నిన్ను నీవు బలి చేసుకునే యిష్టం నాకు నచ్చదు. నేను చెప్పినట్లు వినవలసిందే."

"బాగుంది వరస. అయితే ఏమిటి చెయ్యమంటావో చెప్పు."

"కథ చెప్పు"

"నాకు కథలు రావందే"

"ఎందుకు రావూ? ఎప్పుడూ పుస్తకం దించకుండా చదువుతావు."

"అబ్బ! విసిగిస్తున్నావు బాబూ నేను వెళ్ళిపోనా?"

"ఎక్కడికి పోతావు? పరీక్షలు అయ్యేదాకా నేను కదలమన్నా కదలవు."

"అయితే నా సంగతి నాకన్న నీకే బాగా తెలిసినట్లుందే."

"ఆ"

"సరే - నాకు నిద్ర వస్తుంది పడుకుంటా."

"అచ్ఛా! అలా బుద్ధిమంతురాలిలా పడుకో."

కౌసల్య పరీక్షలు వ్రాసింది. అందరూ ఎవరిళ్ళకు వాళ్ళు పోయారు.

కౌసల్య వేరే యిల్లు మాట్లాడుకొని చేరింది. చంద్రకాంత్ కూడా యింటికి వచ్చాడు.

---

## 15

"అమ్మా నేను చదువు మానేస్తాను" అన్నాడు చంద్రకాంత్.

"అప్పుడేనా బాబూ."

"నీ ఆరోగ్యం బాగా లేదమ్మా. బాగా దగ్గుతున్నావు. నోటివెంట రక్తం పడుతోంది కూడా."

"ఎవరు చెప్పారు నీకు! అంతా ఉట్టిది బాబూ" కౌసల్య నవ్వబోయింది.

"లేదమ్మా నేనింకా చంటివాడ్ని కాదు, నన్ను మోసపుచ్చలేవు, హాస్పిటల్‌కి పోదాంపద."

"దేనికిరా! వేడిచేసి వస్తోంది దగ్గు అంతే."

"ఆ మాట డాక్టరుకే చెప్పుదువుగాని పద."

"దేనికిరా వృథా శ్రమ."

"శ్రమకాదు శ్రద్ధ."

"అయితే ఊరుకోనంటావు."

"ఉహూం."

"సరేపద."

"రిక్షా తెస్తా ఉండు."

"హాస్పిటల్ ఇక్కడేకదరా నడుద్దాం పద."

"ఊహూ నీవు నడవలేవమ్మా! ఆ క[illegible]ంటు ఎంత లోతుకి పోయాయో! ముఖంచూడు. దవడలు లోపలికి పీక్కుపోయాయి. ఎముకలు కనిపిస్తుంటేను."

"నీదంతా విచిత్రంరా బాబూ, వయస్సు మారుతుంటే ఎలా ఉంటారేమిటి!"

"అవన్నీ దేనికి! నేను చెప్పినట్లు చెయ్యి, నేను ఒక ఉద్యోగం చూచాను కూడా."

"ఏమిటా ఉద్యోగం?"

"ప్లీడరు గుమాస్తా."

"ఛీ! ఛీ! నీవు చదివి డాక్టరు అవుతావని నేననుకుంటే అలాంటి కూతలు కూయకు నాముందు."

"అమ్మా! మన అంతస్థునిబట్టి నడవాలి. మన పరిస్థితినిబట్టి మెలగాలి! ఐశ్వర్యవంతులు చదివే చదువు నేను చదవగలనా?"

"ఎందుకు చదవలేవూ? నేను బ్రతికి ఉండగా నీవు ఉద్యోగం చెయ్యటానికి వీలులేదు. డాక్టరు వయ్యేదాకా ఆ ఆలోచన్ను మానెయ్యి."

"సరేలే, ముందు నీ ఆరోగ్యం బాగుకానీ తర్వాత చూద్దాం."

"సరేపద" అంటూ కౌసల్య కొడుకు తెచ్చిన రిక్షా ఎక్కి కూర్చుంది.

తిన్న ... స్పిటల్ చేరింది. డాక్టరు పరీక్ష చేసేరు! పెదవి ... ఊపిరి తిత్తి పూర్తిగా చెడింది. ... ఆరంభమైంది.

చంద్రకాంత్ గతుక్కుమన్నాడు. కౌసల్య కుప్పగా ... పోయింది తను కన్న కలలన్నీ కల్లలేనా?

తన ఆశాసౌధం నేలకూలిందా? తాను ప్రీతితో కట్టిన మేడలన్నీ గాలి మేడలేనా?

కౌసల్యని హాస్పిటల్‌లో చేర్చుకున్నారు.

---

# 16

"కౌసల్యా" సిస్టర్ పిలిచింది.

"ఎవరూ ?" చంద్రకాంత్ మసిబారిన బనీన్‌తో బైటికి వచ్చాడు.

"కౌసల్యా లేదూ ?"

"ఊహూ" చంద్రకాంత్ కళ్ళవెంట నీళ్ళుకారాయి.

"ఏమైంది" అయోమయంగా అడిగింది సిస్టర్.

"లేదు–"

"ఆ_"

"ఆవిడకి అప్పాయింటుమెంట్ ఆర్డర్ వచ్చిందే."

"అమ్మ మీకు నమస్కారాలు చెప్పమంది. ఈ ఉత్తరం యివ్వమన్నది" చంద్రకాంత్ కళ్ళవెంట నీళ్లు జల జల వర్షించాయి.

సిస్టర్ ఉత్తరం విప్పి చూచింది. ఆతృతగా మొదటి నుంచి చివరిదాకా చదివింది.

"ప్రేమాస్పదురాలైన సిస్టర్‌కి నమస్కృతులు. నేని లోకాన్ని విడిచిపోయే సమయం ఆసన్నమవుతోందని అనీ

పిస్తోంది. అందుకే ముందుగా ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నేను మరణిస్తే నా చంద్రకాంత్ దిక్కులేని వాడవుతాడు. అందుకని వాడ్ని మీరు చేరదీసి వాడ్ని పెంచి పెద్దవాణ్ని చేసి విద్యాబుద్ధులు గరిపి ఒక యింటివాణ్ని చేస్తారని ఆశిస్తున్నాను. ఈ భారం మీ మీదా, మా మరిది మోహన్ మీదా వదిలిపెడుతున్నాను. పుట్టకముందే తండ్రినీ - పుట్టి తల్లినీ కోల్పోతున్న దౌర్భాగ్యుడు. వాణ్ని మీరు దయతో ఆదరిస్తారనీ, అభిమానిస్తారనీ ఆశిస్తున్నాను. వీడ్ని డాక్టర్ చెయ్యాలని నాచిరకాల వాంఛితాన్ని మీరు నెరవేరుస్తారనీ తద్వారా నాఆత్మకి శాంతినీ, లోకానికి ఉపకారాన్నీ చేస్తారని భావిస్తున్నాను... నాచంద్రుడు దినదిన ప్రవర్థమానుడై పేదల పాలిట కల్పతరువై అనాథలకు ఆశ్రయమై అభాగ్యులకు అండగా నిలుస్తాడనీ కలకాలం ఆయురారోగ్య ఐశ్వర్యంతో తులతూగాలని ఆశీర్వదిస్తూ అంతిమ నిశ్వాసాన్ని విడుస్తున్నాను.

నాయందు మీరు చూపిన కరుణకీ, అవ్యాజానురాగానికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

అభాగినిగా జీవించి అనాథగా బ్రతికి అనంత విశ్వంలోకి లీనం కాబోతున్న నా కడపటి సమస్కృతుల్ని అందుకుంటారన్న ఆశతో.

మీ

కౌసల్య !

సిస్టర్ కళ్ళవెంట నీళ్లు కారిపోతుంటే చంద్రకాంత్ విస్మయంతో అవలోకిస్తూ నిలబడ్డాడు.

"బాబూ, రా నాయనా! నీ బాధ్యత నామీదఉంచి వెళ్ళింది మీ అమ్మగారు నీమీదకూడా ఒక గురుతర బాధ్యతని ఉంచిపోయింది. మీఅమ్మగారి కోర్కె తీరుస్తావుకదూ?"

"ఏమిటీ -" చంద్రకాంత్ అర్థం కానట్లు చూచేడు.

"నీవు డాక్టరు కావాలనీ, పేదసాదలకి ఉచిత వైద్యం చేయాలనీ, అభాగ్యుల్ని, అనాథల్ని ఆదరించాలనీ మీ అమ్మగారి కోర్కె."

"అవును. అమ్మ బ్రతికుండగా ఎప్పుడూ అదే అంటూ ఉండేది. నేను అప్పుడు సమ్మతించలేదు. కానీ ఇప్పుడు నా లక్ష్యంగా భావిస్తున్నాను సిస్టర్."

"పద బాబూ" అన్నది సిస్టర్.

"మరి బాబాయి మాటో_"

"నేను కలుసుకొని కనుక్కుంటాను. ఆయన సహకారం లభించినా లభించకపోయినా నిన్ను చదివించే భారం నేను వహించ దలుచుకున్నాను బాబూ."

ఇద్దరూ బయలుదేరారు.

"మోహన్ బాబు ఉన్నారా?"

"ఎవరూ?" అంటూ మాధవి బైటికొచ్చింది.

"నేను సిస్టర్ని. ఇతను మీతో మాట్లాడాలి అంటున్నాడు."

"ఎవరూ? చంద్రకాంత్?" ఆశ్చర్య పోయింది మాధవి."

"అవును."

"రా బాబూ, లోపలికిరా."

"బాబాయి లేరూ." సందేహిస్తూ అడిగేడు చంద్రకాంత్.

"ఉన్నారు. పదలోపలికి. స్నానం చేద్దువుగాని."

"అమ్మ..." చెప్పబోయాడు చంద్రకాంత్ కంఠం పెగలలేదు.

"ఏమైంది?"

"ఇక... లేదు."

"ఆ..."

చంద్రకాంత్ కళ్ళలో నీళ్లు నిండాయి.

"దురదృష్ట వంతుడివి బాబూ, ఆ పాపం నాదే" మాధవి కళ్ళు అశ్రుపూరితా లయ్యాయి.

"ఎవరు మాధవీ."

చంద్రకాంత్ వచ్చాడు."

"ఏం? విస్మయంతో అడిగేడు మోహన్.

"అక్క లేదట."

"ఏమైంది."

"చనిపోయింది" మాధవి విచారంగా అన్నది.

"ఆహా!" మోహన్ ఒక్కసారిగా కంపించా
ఆకాశం బ్రద్దలైనట్లు తోచింది.

"మీరుకూడా నిష్ఠురత వహించేరా?" ఆశ్చర్యంతో అడిగింది మాధవి.

"అవును. ఏం చెయ్యనూ? మంచి చేయబోతే చె, ఎదురవుతున్నది. ఆవిడకీ - నాకూను. లోకం మా యిద్దర్ని తప్పుగా అర్థం చేసుకోబోయింది. అందుకే ఆవైపు కన్నెత్తి చూడటం మానేశాను."

"మన నిష్ఠురతే ఇంతవరకు తెచ్చింది. ఆవిడ ఇక్కడ ఉంటే బ్రతికేదేమో."

"ఇక్కడ ఉంటే ఇంతకాలం కూడా బ్రతకపోయేది మాధవీ! అదీ ఒకందుకు మంచిదే అయింది. బ్రతికి బావుకున్నదేమీ లేదు. చచ్చి అయినా సాధిస్తున్నది."

"ఎవర్ని?"

"ఎవర్నీ కాదు, తన ఆశయాన్ని. కొడుకుని చాలని ఆవిడ కోరిక. తను తీర్చుకోలేకపోయినా యిత ద్వారా సఫలం చేసుకోబోతున్నది."

"చంద్రకాంత్ ని ఏ.నం చదివిద్దాం."

"దేనికి? అతడ్ని వెళ్ళనీ"

"ఊహూ వెనక ఒకసారి పొరపాటు జరిగింది. తెలి మళ్ళీ అలాంటి పొరపాటే చెయ్యమంటారా? అక్కకి చేసి అన్యాయంవల్ల ప్రాప్తించిన పాపాన్ని దీని ద్వారానైన క్షాళనం చేసుకోనివ్వండి. అక్క ఆత్మశాంతి."

"ఎలా ?"

"తను చేరదలచిన గమ్యం కోసం ప్రాణాల్నే బలి త్యాగమూర్తి."

"ఎవరి బ్రతుకువారు బ్రతకటమూ ఒక ఘనకార్యమే."

"కాదా? ఆడది స్వయంగా ఆశయ సిద్ధికోసం నిర్వి ంగా పనిచేయటం అమరత్వాన్ని కాంక్షించే-"

"అయితే ఒక దేవతని చేశావన్నమాట."

"నేను చెయ్యలేదు. ఆవిడే అయినది."

"ఉహూ శ్రీరాముడ్ని కైకేయి అడవులకు పంపి డ్ని చేసింది. ఆరాధ్య దైవాన్ని చేసింది. అలాగే అక్కనీ అమరజీవిగా నీవు చేశావన్న ఘనత దక్కు ంలే" నవ్వేడు మోహన్.



—: సమాప్తం :—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B115 |
| పుస్తకం పేరు | మనుష్యులు మనస్సులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 140 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveed |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |